నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122b/PP Tel

ప్రతి గ్రంథాలయంలోను
ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

## డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# చేరంగి విజయ శిఖరానికి స్వాన్ పెన్నులతో

పరీక్షల లో విజయం స్వాన్ పెన్నులతో
ఎంతో సులభమని మీరు గ్రహిస్తారు.
మీ వ్రాత మెత్తగా తేలికగా ప్రవహిస్తుంది.
స్వాన్ ఆర్క్స్ ఫోర్ట్ లేక సేంచరీస్ని వాడి
చూడండి — ప్రత్యేకంగా విద్యార్థులకై
సృష్టించ బడింది.










శ్రేష్ఠమైన ఫలితాల కోసం
**స్వాన్**
డీలక్స్ ఇంకుతో
వ్రాయండి.






**స్వాన్** (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
అద్వాని చాంబర్స్ పి. మెహతా రోడ్డు, బొంబాయి-1
బ్రాంచి: 84బి. కన్నాట్ ప్లేస్ క్రొత్త ఢిల్లీ.

# ఏనుగును తినడం ఎలాగ



## ఔను ఔను ఏనుగే!

ఏనుగులు తియ్యగా గరగరలాడుతూ
తినడానికి పసందుగావుంటాయి.
అతి సులభంగా జీర్ణమవుతాయి కూడా.
అల్లాగే వుంటాయి
పులులు, సింహాలు,
జిరాఫీలు, హిపపొటమస్సులు,
కంగారులు, కుందేళ్లు, ఒంటెలు
ఒకటేమిటి బ్రిటానియా బిస్కట్ల
కంపెనీవారు తయారుచేసేవి–
అన్నీ. అవి బ్రిటానియా
బిస్కట్ల రూపంలో ఉంటాయి.
నోటిలో వేసుకోడానికి
అనువుగా వుండి ప్రతివారికి
విందు కొల్పిస్తాయి. మీరు
వాటిని తిని ఆనందించండి.
జూనంతా మ్రింగేయవచ్చు!
**ఔను బ్రిటానియా జూ.**





# బ్రిటానియా జూలాజికల్ బిస్కట్లు

**భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు** బ్రిటానియా

BBC-2769

# అతనితో చేరండి!

## కిడ్డీ బ్యాంక్ ఖాతాలు కలిగివున్న 60,000 మంది పిల్లలలో ఇతను ఒకడు.

ఇతను డబ్బును పొదుపు చేయడమేగాక వడ్డీ కూడా సంపాదిస్తాడు.
దానిని ఒక ఆటలాగ భావించి ఆనందిస్తాడు.

అతనిలా మీరు ఎందుకు వుండకూడదు?

మీ నాన్నతోగాని, అమ్మతోగాని మాట్లాడి
మీ స్వంత కిడ్డీ బ్యాంక్ ఖాతాని తెరవండి.
దానిని చూసి మీరు ముచ్చటపడతారు.

మీకు దగ్గరలో వున్న ఆంధ్ర బ్యాంక్ బ్రాంచితో
ఈ రోజే సంప్రదించండి.




**ది ఆంధ్ర బ్యాంక్ లిమిటెడ్**

ప్రధాన కార్యాలయం: సుల్తాన్ బజార్, హైదరాబాద్.

కె. గోపాలరావు, ఛైర్మన్

ఎమ్. పి. సుబ్బారావు, జనరల్ మేనేజర్

జాతి సేవలో వున్న జాతీయం చేయబడని బ్యాంకు.




FDS/AB-1821TE

# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["ప్రాణవిక్రయం"] ఎస్. ఉమామహేశ్వరరావు రచన. ఈ విచిత్రమైన కథలో "విజయమూ", "అపజయమూ" ఎలా పెనవేసుకుని ఉంటాయో మనం చూడవచ్చు.

ఈ సంచికలో "కీలుగుర్రం" అనే మరొక అరేబియా దేశపు పెద్ద కథ ఆరంభమవుతున్నది.

"గర్వభంగం" అన్న కథలో తర్కంతో నిజాన్ని అబద్ధమూ, అబద్ధాన్ని నిజమూ ఎలా చేయవచ్చునో మనం చూస్తాం.

సంపుటి 52 జనవరి'73 సంచిక 1




ఘృతేన వర్ధతే బుద్ధిః,
క్షీరే ణాయుష్య వర్ధనం,
శాకేన వర్ధతే వ్యాధిః,
మాంసం మాంసేన వర్ధతే. 1

[నెయ్యి బుద్ధిని పెంచుతుంది. పాలు ఆయువును పెంచుతాయి. కూరగాయలు వ్యాధిని పెంచుతాయి. మాంసం మాంసాన్ని పెంచుతుంది.]

అనభ్యాసే విషం శాస్త్రం,
అజీర్ణే భోజనం విషం,
దరిద్రస్య విషం గోష్ఠీ,
వృద్ధస్య తరుణీ విషం. 2

[అభ్యాసం లేని వాడికి శాస్త్రజ్ఞానమూ, అజీర్తి గల వాడికి భోజనమూ, దరిద్రుడికి వినోదమూ, ముసలివాడికి పడుచు భార్యా విషంలాటివి.]

వృథా వృష్టి స్సముద్రే చ,
వృథా తృప్తేచ భోజనం,
వృథా ధనవతౌ దానం,
దరిద్రే యౌవనం వృథా. 3

[సముద్రానికి వర్షమూ, ఆకలి తీరినవాడికి భోజనమూ, ధనవంతుడికి దానమూ, దరిద్రుడికి యౌవనమూ వృథా.]

తగినవి - తగనివి - వ్యర్థమైనవి




# అగ్నిపరీక్ష

పురందర రాజకుమార్తె లావణ్య అందంలో దేవతాస్త్రీలకు సాటి రాగలది. తగిన వరుడు దొరికితే ఆమెకు వివాహం చెయ్యాలనే ఉద్దేశంతో ఉన్నాడు రాజు. పురందరదేశం ఆ కాలంలో మారుమూల దేశం. ఆ దేశం నుంచి మరే దేశానికి వెళ్ళాలన్నా అనేక రోజులపాటు అరణ్యాలలోనూ, కొండల మీదా ప్రయాణాలు చెయ్యాలి. లావణ్యకు తగిన వరుడు దొరకక పోవటానికి అదే ప్రధానకారణం.

లావణ్య కూడా వివాహం కోసమే ఎదురు చూస్తున్నది. ఆమెకు తన నిత్యజీవితంలో ఏమీ ఆనందం కనిపించలేదు. రాజభవనంలో ఆమె చెలికత్తెలు ఆమెను వినోదింప జేయటానికి చెప్పిన కథలే మళ్ళీ మళ్ళీ చెబుతారు. ఆడిన ఆటలే మళ్ళీ మళ్ళీ ఆడ తారు. అందుచేత ఆమెకు కాలం గడవ టమే కష్టంగా ఉన్నది.

ఒకనాడు ఆమె రాజభవనంలో ఎవరికీ చెప్పకుండా, తమ నగరానికి ఉత్తరాన ఉన్న వనాలకు ఒంటరిగా బయలుదేరింది. ఆమె పరధ్యానంగా నడుచుకుంటూ వెళ్ళి ఒక అత్యద్భుతమైన ఉద్యానవనంలో ప్రవే శించింది. ఎటు చూసినా అమిత అందంగా ఉన్న పొదలూ, వాటిలో అపూర్వమైన పుష్పాలూ కనిపించాయి. అలాటి పూలు గాని, చెట్లు గాని లావణ్య ఎన్నడూ చూడ లేదు. ఆ ప్రాంతం మనుషులు పెంచిన తోటగానూ లేదు. సహజంగా తయారైన వనంగానూ లేదు. అక్కడ ఎలాటి జన సంచారమూ ఉన్నట్టు కనిపించలేదు. ఆఖరుకు జంతువులూ, పక్షులూ కూడా ఆమెకు కనిపించలేదు.

లావణ్య ఒక్కొక్క పొద వద్దికూ వెళ్ళి, దానికి గల పూల అందమూ, సువాసనా అనుభవిస్తూ తిరగసాగింది. ఒక పొద మీద

ఆర్. సూర్యనారాయణ



ఆమెకు అన్నిటికన్నా అందమైన పూలు కనిపించాయి. వాటి సువాసన వర్ణనాతీతంగా ఉన్నది. ఆమె ఒక పువ్వు కోసి తలలో పెట్టుకోబోయింది.

"ఎవరా పూలు కోసేది?" అని గర్జిస్తూ ఒక యువకుడు ఒక పొదచాటు నుంచి లావణ్య ఎదటికి వచ్చాడు. ఆమెను చూడగానే అతనిలో విచిత్రమైన మార్పు వచ్చింది. ఏదో అనబోతూ అతను ఆమె కేసి కన్నార్పకుండా చూడసాగాడు.

"పూలు కొయ్యరాదని నాకు తెలియదు. అడగటానికైనా ఎవరూ కనిపించలేదు. ఇక్కడ ఎవరూ లేరనే అనుకున్నాను," అన్నది లావణ్య.

యువకుడు చిన్నగా నవ్వి, "అవునవును. ఇక్కడ ఎవరూ ఉండరు. నేను మాత్రం ఈ వనానికి కాపలా కాస్తూ ఇక్కడే ఉంటాను," అని, ఆమె ముందు కోసుకున్న పొద నుంచే మరికొన్ని పూలు కోసి ఆమె చేతిలో పెట్టాడు.

"పూలు కోయరాదన్నారుగా?" అన్నది లావణ్య.

"నీ అంత అందగత్తెకు నియమాలు అవసరం లేదు," అన్నాడతను.

"మీ రెవరు?" అని లావణ్య మర్యాదగా అడిగింది.

"నా పేరు సువ్రతుడు. ఈ గంధర్వ వనానికి పాలకుణ్ణి," అన్నాడు ఆ యువకుడు.

"గంధర్వుడివా!" అంటూ లావణ్య కంగారుగా తన చేతిలో ఉన్న పూలను కింద వదిలేసింది.

గంధర్వులంటే అందరికీ ఉన్నట్టే లావణ్యకు కూడా భయం ఉన్నది. వాళ్ళ స్నేహం మామూలు మానవులకు అచ్చిరాదు. వాళ్ళు అనేక విద్యలు నేర్చిన వాళ్ళు. అయితే, గంధర్వులు తమ దేశానికి అంత దగ్గిరలో ఉంటున్నట్టు లావణ్యకు తెలియదు.

ఆమె కంగారు చూసి సువ్రతుడు, "భయపడకు, రాజకుమారీ. నేను ప్రస్తుతం గంధర్వులకు కింకరుడుగా ఉంటున్న

ప్పటికీ, జన్మతః నీలాటమానవుణ్ణే. మా తాత గారు ఇక్కడికి తూర్పుగా ఉన్న జయ సింధుదేశపు రాజు. నేను పసివాణ్ణిగా ఉండ గానే నా తల్లి తండ్రులు పోయారు. అప్పుడు నా మాతామహుడు నన్ను తన ఇంటికి తెచ్చి పెంచాడు. నేను కొంచెం పెరిగినాక మా తాత వెంట ఈ ప్రాంతాలకే వేటకు వచ్చాను. అప్పుడు నన్ను ఒక గంధర్వ రాణి పట్టుకుని తీసుకుపోయింది. నేను తనను ప్రేమించి తనకు భర్తగా ఉంటానని ఆమె ఆశ. నేను ఆమెను ప్రేమించలేను. అందుచేత పగటిపూట నన్ను ఈ వనానికి కాపలా ఉంచింది. రాత్రికాగానే నన్ను ఆమె తమ లోకానికి తీసుకుపోతూ ఉంటుంది. నాకు ఈ గంధర్వులన్నా, వీళ్ళ లోకమన్నా రోజు రోజుకూ అసహ్యం పుట్టుతున్నది. వీళ్ళ మాయనుంచి నన్ను ఎవరన్నా తప్పి స్తారా అని ఎంతో ఆశపడతాను. కాని నా ఆశ ఫలించదు. అది ఫలించే మార్గం అందుబాటులో కనపడదు!" అంటూ నిట్టూర్చాడు.

అతను మాట్లాడుతున్నంతసేపూ అతన్ని కన్నార్పకుండా చూస్తూ ఉండిన లావణ్య, అతని స్థితికి ఎంతో జాలిపడుతూ, "ఏమిటా మార్గం?" అని అడిగింది.

సువ్రతుడు లావణ్య కేసి అనుమానంగా చూస్తూ ఇలా చెప్పాడు:

"ప్రతి పౌర్ణమినాటి రాత్రీ గంధర్వరాణి తన పరివారంతో వచ్చి ఈ వనంలో విహా రాలు చేస్తుంది. నేను ఆమె వెంటనే





ఉంటాను. ఆ సమయంలో మనిషి జన్మ ఎత్తిన వారెవరైనా నన్ను కౌగలించుకుని వదిలి పెట్టకుండా పట్టుకోవాలి. గంధర్వరాణి తన మాయలు ప్రయోగించి ఆ మనిషిని భయంకరమైన పరీక్షలకు గురిచేస్తుంది. వాటికి తట్టుకుని నన్ను ఆ మనిషి గట్టిగా పట్టుకోవాలి. అప్పుడు గాని నేను గంధర్వుల బారినుంచి బయటపడను. నా కోసం ఇంత బాధపడే మనిషికి నేనంటే ఎంత ప్రేమ ఉండాలి! ఎంత సాహసం కావాలి! నన్ను ఎరిగినవాళ్ళే మానవప్రపంచంలో ఉన్నారా, లేదా అని నాకు అనుమానంగా ఉంది. అలాటప్పుడు నన్ను కాపాడేవాళ్ళు ఉంటారనుకోవటం భ్రమేగదా!"

సువ్రతుడు ఇలా అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, "సూర్యుడు వాలి పోతున్నాడు. నువు ఎంత దూరం వెళ్ళాలో. చీకటి పడే వేళకు నువు ఇక్కడ ఉండటం క్షేమం కాదు!" అన్నాడు,

"నీకు త్వరలోనే గంధర్వుల నుంచి విముక్తి కలుగుతుందనుకుంటాను. వస్తాను!" అని లావణ్య తన ఇంటికి బయలుదేరి వెళ్ళిపోయింది.

పూర్ణిమ ఇంకా నాలుగు రోజులున్నది. ఈ నాలుగు రోజులూ లావణ్య సువ్రతుణ్ణి గురించి విడవకుండా ఆలోచించి, అతన్ని కాపాడటానికి, అవసరమైతే ఆ ప్రయత్నంలో ప్రాణాలు విడవటానికీ దృఢంగా నిశ్చయించుకున్నది.

పూర్ణిమనాటి సాయంకాలం ఆమె గంధర్వ వనానికి ఒంటరిగా బయలుదేరి వచ్చింది. చీకటిలో ఎవరికీ కనిపించకుండా ఉండటానికి ఆమె నల్లని దుస్తులు ధరించింది. చీకటి పడకముందే ఆమె పొదలలో దాగి కూర్చుని, తన జుట్టువిప్పి ముఖానికి అడ్డం వేసుకున్నది.

ఝాము రాత్రి గడిచినాక వనంలో అలికిడి వినిపించింది. గంధర్వులు జంటలు జంటలుగా వనంలో షికార్లు చేస్తున్నారు. లావణ్య ప్రతి జంటా తన పక్కగా వెళ్ళినప్పుడల్లా, వారిలో గంధర్వరాణి

ఉన్నదేమో అని శ్రద్ధగా పరిశీలిస్తున్నది. దాదాపు అర్ధ రాత్రి కావస్తూండగా సువ్రతుడూ, మరొక స్త్రీ ఆమె దాగి ఉన్న ప్రాంతానికి వచ్చారు. సువ్రతుడి వెంట ఉన్న స్త్రీ గంధర్వరాణి అయి ఉంటుందని లావణ్య సులువుగానే గ్రహించింది. ఆ జంట తనకు సమీపంగా రాగానే లావణ్య చప్పున లేచి వెళ్ళి సువ్రతుణ్ణి గట్టిగా కౌగలించుకున్నది.

గంధర్వరాణి ఒక్క క్షణంపాటు నివ్వెరపోయి, సువ్రతుడు తన చేతి నుంచి జారిపోతున్నాడని గ్రహించి, మాయలు ప్రయోగించింది.

లావణ్య కౌగిట ఉన్న సువ్రతుడు అంతలో ఒక కొండచిలువగా మారాడు. దేనికైనా తెగించి ఉన్న లావణ్య ఆ కొండచిలువను వదిలి పెట్టలేదు.

ఇంతలో కొండచిలువ సింహంగా మారింది. లావణ్య గుండెలు అదిరిపోయాయి, కాని ఆమె ఆ సింహాన్ని గట్టిగా వాటేసుకున్నది.

ఇంతలో సింహం ఎర్రగా కాలుతున్న గునపంగా మారింది. లావణ్య శరీరమంతా చుర్రున కాలి భరించరాని బాధ కలిగింది. కాని లావణ్య గునపాన్ని విడవలేదు.

తరవాత ఏమి జరిగినదీ ఆమెకు తెలియదు. ఆమెకు స్పృహ తెలిసేసరికి గంధర్వవనంలో ఎవరూ లేరు. ఆమె కౌగిట సువ్రతుడున్నాడు. ఆమెతోపాటే అతనికీ స్పృహ వచ్చింది.

"నన్ను గంధర్వుల నుంచి కాపాడావు. నీ ఋణం ఎలా తీర్చుకోగలను? మనం మీ నగరానికి పోదాం పద. నిన్ను ఇంటికి చేర్చినదాకా నా సంగతి చూసుకోలేను," అన్నాడు సువ్రతుడు లావణ్యతో.

రాజకుమార్తె కనపడక రాజభవనం ఆందోళనతో సతమతమవుతున్నది. లావణ్య జరిగినదంతా చెప్పగానే ఆమె తండ్రి, "నాయనా, నీకోసం నా కుమార్తె అగ్ని పరీక్ష ఎదుర్కొన్నది. నీకన్న ఆమెకు తగిన భర్త ఎవరుంటాడు?" అని సువ్రతుడితో అని, వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు.



# పంచముడు

కావేరితీరాన ఒక గ్రామంలో కాంచనశర్మ అనే నైష్ఠిక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన బహు ముక్కోపి. ఆ ఊళ్ళోనే పరమసాధువూ, జ్ఞాని అయిన కొండప్ప అనే మాలదాసరి ఉండేవాడు.

ఒక పర్వదినంనాటి తెల్లవారగట్ట గ్రామస్థులు కావేరిలో స్నానాలు చెయ్యటానికి వచ్చారు. కాంచనశర్మ స్నానం చేసి ఒడ్డుకు వస్తూండగా, కొండప్ప కూడా స్నానం చేసి, తలవంచుకుని నడుస్తూ ఆయన పక్కగా వెళ్ళాడు. అప్పుడు కొండప్ప తడిబట్ట కాంచనశర్మకు తగిలింది.

కాంచనశర్మ రుద్రుడైపోయి, పళ్ళు పటపటా కొరుకుతూ, కొండప్పను నానా తిట్లూ తిట్టాడు. కొండప్ప తాను మసక వెలుతురులో చూడక తప్పు చేశానని క్షమాపణ చెప్పుకుని, దూరంగా సాష్టాంగ పడ్డాడు. అప్పటికి కోపం చల్లారక కొండప్ప తలను తన కాలితో నాలు గైదు సార్లు తన్ని, అస్పృశ్యుణ్ణి తాకినందుకు మళ్ళీ నదిలో స్నానం చేశాడు కాంచనశర్మ.

ఆయన స్నానం చేసివస్తూ, కొండప్ప కూడా మళ్ళీ స్నానం చేస్తూండటం గమనించి, "పంచముణ్ణి తాకినందుకు నేను స్నానం చేశాను. నువు మళ్ళీ ఎందుకు స్నానం చేస్తున్నావు?" అని అడిగాడు.

దానికి కొండప్ప, "కోపమనే పంచముడు మాలవాడి కన్న అధమాధముడు. వాడి స్పర్శ నుంచి పవిత్రుణ్ణి కావటానికి మళ్ళీ స్నానం చేస్తున్నాను," అన్నాడు.

—మండపాక ఉమాదేవి





# యక్షపర్వతం

## 8

[మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ నడుం విరిగేలా తన్ని కింద పడవేసి, ఖడ్గజీవదత్తులు శిథిలభవనాల్లోకి పోయారు. అక్కడ వాళ్ళను పూజారిణి భృత్యులు పట్టుకున్నారు. పూజారిణి ఆ యిద్దర్నీ చీకటిగదిలో బంధించమన్నది. ఖడ్గజీవదత్తులు తమ పక్క గదిలో వున్న సింహాన్ని అక్కడికి వచ్చిన పూజారిణి భృత్యుల పైకి ఉసికొల్పారు. తరవాత—]

ఆకలిగొని వున్న సింహం భయంకరంగా గర్జిస్తూ వచ్చి మీద పడగానే, పూజారిణి భృత్యులు భయంతో వణికిపోయి, చావు కేకలు పెడుతూ సింహానికి అందకుండా పారిపోవాలని చూశారు. కాని సింహం వాళ్ళ మధ్యపడి నోటికి అందినవాడినల్లా పట్టి విదిలించసాగింది.

ఖడ్గ జీవదత్తులు కూలిపోయిన గది ద్వారం వద్ద నిలబడి పెద్దగా నవ్వుతూ, "ఒరే, పూజారిణి శిష్యుల్లారా! సింహానికి మీరు నాలుగైదు రోజులుగా ఆహారం వేసినట్టు లేదు. అందుకే అది అంతగా రెచ్చిపోయి మీ ప్రాణాలు తీస్తున్నది. మీలో ఒకరు ముందుకు వచ్చి దానికి ఆహారం కండి. అప్పుడు తతిమ్మా వాళ్ళయినా బతుకుతారు," అన్నారు.

పూజారిణి భృత్యులు యీ మాట లేవీ వినిపించుకునే స్థితిలో లేరు. వాళ్ళల్లో



నలుగురైదుగురు ఆసరికే సింహం పంజా దెబ్బలకు బాగా గాయపడి నేల కొరిగారు. మరొకడు దాని నోటికి చిక్కి లబలబలాడుతున్నాడు. గాయపడకుండా ఇక మిగిలిన అయిదారుగురూ పక్కన వున్న పదీ పన్నెండడుగుల శిథిలమైన గోడ మీది కెక్కి కూర్చుని ప్రాణభయంతో నిలువెల్లా వణికి పోతున్నారు.

సింహం ఒకసారి చుట్టూ కలయ చూసింది. దానికి తాను గాయపరిచిన మనుషుల్లో ఎవర్నీ తినాలని వున్నట్టు లేదు. ఆ ప్రదేశం నుంచి త్వరగా పారిపోయి, ఏ అరణ్యమో చేరాలన్నట్టుగా వుంది దాని వాలకం.

జీవదత్తుడు తన చేతిలోని దండాన్ని సింహం కేసి గురి చేసి, "సింహరాజా! ఇంతమంది చూస్తూండగా ఆహారం తినటం వల్ల దిష్టి తగులుతుందేమో అని భయపడుతున్నావా?" అంటూ నవ్వి, "అలా అయితే యిదిగో, ఈ పక్కనే భవనం కిందికిపోయే మెట్లున్నవి. ఆ దారినపోయి యీ శిథిలభవనాల్లో నుంచి బయటపడి, నది దాటి అరణ్యం చేరు!" అంటూ సింహం కేసి రెండడుగులు వేసి, దాన్ని మెట్లున్న వైపుకు మళ్ళించేందుకు దండాన్ని ముందుకు చాచి ఝుళిపించాడు.

సింహం కళ్ళెంత చేసి, పెద్దగా నోరు తెరిచి చెవులు దిబ్బెళ్ళు పడేట్టు పెద్దగా గర్జించి, జీవదత్తుడి కేసి దూకబోయింది. అది ముందు రెండు కాళ్ళూ ఎత్తి, వెనక కాళ్ళ మీద నిలబడి కుప్పించి దూకబోయే సమయంలో, జీవదత్తుడు దాని పొట్ట కింద దండాన్ని ఆనించి బలంగా పక్కకు తోశాడు. ఆ ఊపుకు సింహం నేల మీద పడి దొర్లుకుంటూ పోయి మెట్లున్న గది ద్వారానికి అడ్డంగా పడింది.

"సింహరాజా, యిక లేచి నిలబడు! పూజారిణి తన బంట్లతో స్వయంగా యిక్కడికి వచ్చే ముందే త్వరగా మెట్లు దిగి పారిపో." అన్నాడు జీవదత్తుడు, దండం ఎత్తి సింహం కేసి నడుస్తూ.

మొండి గోడ మీద కూర్చుని యిదంతా చూస్తున్న పూజారిణి భృత్యులకు జీవదత్తుడు సింహాన్ని ఎదుర్కొన్న తీరూ, దాన్ని ఒక్క దండం దెబ్బతో నాలుగైదు పల్లటీలు కొట్టించిన నేర్పూ ఎంతో ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. వాళ్ళల్లో ఒకడు రెండు చేతులూ ఎత్తి జీవదత్తుడికి నమస్కరిస్తూ, "మహామాంత్రిక శిరోమణీ, నమస్కారం! మీ మంత్రశక్తి మామూలు మనుషులకు అలవడేది కాదు. ఈ మహాశక్తి పూజారిణిని హతం చేసి తమరే యీ శిథిలనగరాన్ని ఎందుకు ఏలగూడదు? అప్పుడు మేమంతా మీ శిష్యులమై మీకు సేవలు చేస్తూ హాయిగా బతుకుతామే!" అన్నాడు.

వాడు మాట ముగించే లోపలే పక్కన వున్న అతడి తోటి వాళ్ళు, "గురుద్రోహం! గురుద్రోహం!" అని కేకలు పెడుతూ వాడి మీద కలియబడ్డారు. మొండి గోడ మీద కుస్తీపట్లు ప్రారంభమయినై. ఆ రద్దీలో గోడ మీద కాలిపట్లు తప్పి యిద్దరు భృత్యులు దభీమంటూ కిందపడ్డారు. మెట్ల కేసి దిగబోతున్న సింహం ఒక్కసారిగా అదురుకుని తల తిప్పి చూసి, చిన్నగా గర్జిస్తూ వాళ్ళ కేసి రాబోయింది.

జీవదత్తుడు దండం పైకెత్తి సింహాన్ని అదిలిస్తూ, "ఇక మెట్లు దిగి నీ దారిన



నువు పో. అనవసరంగా పూజారిణి శిష్యుల పోట్లాటలో తల దూర్చి చిక్కుల పాలవకు," అన్నాడు.

సింహానికి ఆసరికి జీవదత్తుడి చేతిలోని దండం అంటే భయం పట్టుకున్నది. ఇంతవరకు రెండుసార్లు దాని దెబ్బతిని వుండటంతో అది చిన్నగా గుర్రుమంటూ తిరిగి తిరిగి చూస్తూ, మెట్లున్న గది ద్వారం దాటి పోయింది.

అప్పటివరకూ జరుగుతున్నదంతా మౌనంగా చూస్తూ వున్న ఖడ్గవర్మ, "జీవా! ఇక మనం మాత్రం యిక్కడెందుకు? పూజారిణి శిష్యులు శిగపట్లు పట్టుకుని కిందా మీదా పడుతున్నారు. ఇప్పుడు



మనను అడ్డగించేవాళ్లెవరూ లేరు. ఈ దిక్కుమాలిన శిథిల భవనాలను వదిలి తిరిగి అరణ్యం చేరుదాం," అన్నాడు.

"అలాగే చేద్దాం. మనం కూడా సింహం వెళ్ళిన దారినే పోయి, మనం యిక్కడికి వచ్చిన గుహ ద్వారాన్ని చేరగలమేమో చూద్దాం," అంటూ జీవదత్తుడు బయలుదేరాడు.

ఆ శిథిలభవన ప్రాంతాల్లో యిక తమను ఎదిరించే వాళ్ళు ఎవరూ లేరనుకోవటంలో ఖడ్గవర్మ పెద్ద పొరబాటు చేశాడు. అతడూ, జీవదత్తుడూ బంధ విముక్తులు కావటం, సింహం పెద్దగా గర్జిస్తూ పూజారిణి భృత్యుల్లో కొందరిని గాయపరచటం అంతా పూజారిణికి బతికి బయటపడి పారిపోయి వచ్చిన ఒక భృత్యుడి ద్వారా తెలిసింది.

ఆ వార్త వింటూనే పూజారిణి కళ్ళెర్ర చేసి, చేతిలోని శూలాన్ని ఝళిపిస్తూ, "మహాభూతా! ఇదేమి వింత? ముసలి పూజారి అంత వాణ్ణి నా మంత్ర బలంతో ఓడించి చీకటి కొట్లో బంధించానే! అటువంటి నా మీదికే యిద్దరు మానవులు దండెత్తి రావటమా? నా రాజ్యంలోనే జొరబడి నా శిష్యుల్ని కొట్టి గాయపరిచి నన్ను అవమానించటమా! ఇది సహించను. ఒరే, శిష్యాధముల్లారా! బయలుదేరి, ఆ ఇద్దరు మానవ పురుగులూ ఎక్కడున్నారో చూపండి," అన్నది.

ఖడ్గ జీవదత్తులు సింహాన్ని హడలగొట్టిన తీరూ, అంతకు ముందు మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ పెట్టిన బాధలూ చూసిన శిష్యుల్లో యిద్దరు గడగడలాడిపోతూ, "మహాశక్తి పూజారిణీ! ఆ మానవులిద్దరూ మహాసత్వుల్లాగా, గొప్ప మంత్రవేత్తల్లాగా కనబడుతున్నారు. వాళ్ళు మన ఆస్థాన మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ..."

భృత్యులు మాట ముగించే లోపలే పూజారిణి వాళ్ళల్లో ఒకణ్ణి శూలంతో వెన్ను మీద పొడిచి, "నోరు ముయ్యండి, పారుబోతు వెధవల్లారా! వాళ్ళిద్దర్నీ యిప్పుడే పట్టి మహాభూతానికి బలి చేయబోతున్నాను.

ముందుండి దారి తియ్యండి!" అన్నది పళ్ళు కొరుకుతూ.

భృత్యులు ప్రాణం బితుకు బితుకు మంటూండగా ముందు బయలుదేరారు. వాళ్ళందరికన్నా కొంచెం ముందుగా మాంత్రికుడూ, వాడి జడలభూతం పెద్ద పెద్ద అంగులు వేస్తూ నడవసాగారు.

"గురో! వాళ్ళిద్దర్నీ పట్టుకుని ఒక్కసారిగా విరుచుకు తింటాను," అన్నది జడలభూతం మాంత్రికుడితో.

"అలాంటి పొరబాటు పని చెయ్యకురా, శిష్యా! మన శిథిల నగరంలో జొరబడిన ఆ యిద్దరు కుర్రకుంకలూ, పూజారిణీ ఒకళ్ళకొకళ్ళు ఎదురుపడితే, మన పూజారిణె ఓడిపోతుందన్న నమ్మకం నాక్కలుగుతున్నది. అప్పుడు మనమే యీ శిథిలనగరానికి రాజూ, మంత్రీ అయిపోతాం. ముసలి మాంత్రికుణ్ణి చీకటి కొట్టులో నుంచి బయటికి తీసి, అతడి దగ్గిర మరికొన్ని మంత్ర విద్యలు నేర్చుకుందాం," అన్నాడు మాంత్రికుడు చిన్న గొంతుతో.

జడలభూతం ఆ మాటలకు ఎంతో సంతోషించి, "రాజూ, మంత్రీ! బావున్నది గురో," అంటూ వెనక్కు తిరిగి చూసింది.

పూజారిణీ, ఆమె తతిమ్మా శిష్యులూ చాలా దూరాన వున్నారు. పూజారిణి తన



భృత్యుల్ని శిథిల భవనాలన్నీ నగరం ప్రవేశించిన యువకులిద్దరి కోసం గాలించమని ఆజ్ఞాపించింది. కాని ఆ సమయంలో ఖడ్గజీవదత్తులు శిథిల భవనాల్లోని మరొక ప్రాంతం చేరి, అక్కడి నుంచి బయట పడి, తిరిగి అరణ్యం చేరేందుకు మార్గం ఏమైనా కనబడుతుందా అని చూడసాగారు. వాళ్ళు సొరంగ మార్గాన వచ్చిన దారి మాత్రం కనుక్కోలేకపోయారు.

"ఖడ్గా, మనం లోపలికి వచ్చిన దారి వెంట బయటపడే అవకాశం కనబడటం లేదు. పూజారిణి శిష్యుల్లో ఎవణ్ణయినా ఒంటరిగా దొరక పుచ్చుకుని, వాడి ద్వారా ఆ మార్గం ఎక్కడున్నదో తెలుసుకోవటం



తప్పు మరో ఉపాయం లేదు." అన్నాడు జీవదత్తుడు.

"ఆ శిష్యుల మూక నుంచి కూడా మనం చాలా దూరం వచ్చినట్టుంది. సింహం ఏమైనట్టు? అది అరణ్యం చేరినట్టేనా?" అన్నాడు ఖడ్గవర్మ.

"అదీ మనలాగే యిక్కడ చిక్కుపడి నట్టుంది. మధ్య మధ్య దాని గర్జనలు వినబడటం లేదా, నీకు?" అంటూ జీవదత్తుడు ఒక శిథిల భవనంలోని గది లోపలికి తొంగి చూసి, "ఖడ్గా, ఇటురా! అమ్మ, దుర్మార్గులు! దారేపోయే వర్తకుల్నీ, ప్రయాణీకుల్నీ దోచి ఎన్ని ధాన్యం బస్తాలు యీ గదిలో దాచారో చూడు!" అన్నాడు.

ఖడ్గవర్మ కూడా గదిలోకి తొంగి చూశాడు. అతడికి గదిలో ఎత్తుగా పేర్చిన ధాన్యం బస్తాలు కనిపించినై. వాటిలో కొన్నిటి కుట్లు పిగిలి, వడ్లూ, జొన్నలూ, గోధుమలూ కిందికి కారి పోగులుగా పడివున్నవి.

"జడలభూతాన్ని ముందు ప్రయోగించి జనాన్ని భయపెట్టి మాంత్రికుడూ, అతడి స్నేహితులూ యీ విధంగా దారే పోయేవాళ్ల నుంచి తమ కవసరం అయిన తినుబండారాలు అపహరిస్తున్నారన్నమాట! మొత్తం మీద పూజారిణి తెలివి గలది లాగే కనిపిస్తున్నది. ఈ ఎత్తుగడలన్నీ దాని ఆలోచనలే అయి వుంటాయి," అన్నాడు ఖడ్గవర్మ.

"ఈ ధాన్యంలో ఒక్క గింజ కూడా పూజారిణి ముఠా నోటికి అందకుండా చేస్తే ఎలా వుంటుందంటావు? అప్పుడు కడుపు కాలి, వాళ్ళు బతుకు తెరువు కోసం యీ శిథిల భవనాల నుంచి బయటికి వస్తారు," అన్నాడు జీవదత్తుడు.

"మన ఇద్దరికీ ఒకే ఆలోచన కలిగిందే!" అంటూ ఖడ్గవర్మ నవ్వి, దుస్తుల్లో నుంచి చెకుముకిరాయి తీసి కొట్టి దూది ముట్టుకునేలా చేసి, అది కాస్త మంట కాగానే గదిలోని ధాన్యం బస్తాలలో ఒక దానికి అంటించాడు.

ఖడ్గ జీవదత్తులు గది ముందు నిలబడి క్రమంగా మంట పెద్దదై, ధాన్యం బస్తాలు

ఒకటొకటిగా అంటుకోవటం చూడసాగారు. నాలుగైదు నిమిషాల్లో గదిలో పెద్ద మంట లేచింది. ధాన్యం కాలి టపటపమంటూ కొంత పేలాలుగా మారి, గాలికి లేచి వాకిటి వరకూ వచ్చి పడసాగినై.

"ఈ పేలాలు తిని యీ దుర్మార్గులు మరి కొంతకాలం యీ శిథిల భవనాలను అంటి పెట్టుకుని వుండే అవకాశం వుంది. ఏం చేయటం?" అన్నాడు ఖడ్గవర్మ.

"కొంచెం ఆగు. మంటలు మరి కాస్త లేస్తే అంతా మాడి, బుగ్గి బూడిదా అయిపోతుంది. కాని, అసలు ప్రమాదం, యీ మంటలు చూసి పూజారిణీ, దాని శిష్యగణం యిక్కడికి వస్తారు! అప్పుడు..."

జీవదత్తుడు మాట ముగించే లోపలే ధాన్యం బస్తాలు కాలుతున్న గది పక్కగల మరో గది నుంచి ఏదో మానవ కంఠం ఆర్తనాదాలు చేయటం వినిపించింది.

"ఖడ్గా, ఈ పక్క గది తలుపులు మూసి వున్నవి. లోపలి నుంచి ఎవరో కేకలు పెడుతున్నారు!" అంటూ జీవదత్తుడు గదిని సమీపించి, తలుపులను బలంగా నెట్టి చూశాడు.

ఖడ్గవర్మ అతడి దగ్గిరకు పోయి నవ్వుతూ, "జీవా! హడావిడిలో నువ్వు తలుపులకు బయట వేసి వున్న అంత పెద్ద తాళాన్ని కూడా చూసినట్టు లేదు! నీ మంత్ర దండంతో తలుపులు విరగ్గొట్టు." అన్నాడు.

ఆ వెంటనే జీవదత్తుడు దండం ఎత్తి తలుపులకు వేసి వున్న తాళం మీద బలంగా కొట్టాడు. తాళం పగిలి కింద పడిపోయింది. గొళ్లెం పక్కకు లాగి తలుపులను వెనక్కు నెట్టాడు ఖడ్గవర్మ.

గదిలో అంతగా చీకటి లేదు. గోడపైన అంత ఎత్తులో వున్న ఒక చిన్న కిటికీ నుంచి లోపలికి వెలుగు వచ్చి పడుతున్నది. ఆ వెలుగులో వాళ్ళకు గోడలో వున్న ఇనప మేకులకు, గొలుసుతో కట్టబడి వున్న వృద్ధుడొకడు కనిపించాడు. అతడు ఆజానుబాహువు, బక్కచిక్కి వున్నాడు. పొడవాటి తెల్ల గడ్డం గాలికి రెపరెపలాడుతున్నది.

—(ఇంకా వుంది)





# ప్రాణవిక్రయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాలుడు, "రాజా, వెనకటికి మాధవుడు కానివారందరికీ సహాయపడి, అయిన వాళ్ళకు నిరాకరించాడు. అలాగే నువు కూడా కానిపోనివారి కోసం శ్రమించటం లేదు గద? నీకు శ్రమతెలియకుండా ఉండ గలందులకు మాధవుడి విచిత్రకథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పెన్నానదీ తీరాన మాధవుడు అనే సంపన్న యువకుడు ఉండేవాడు. చాలా గారాబంగా పెరిగి నందున మాధవుడికి ఏ విథంగానూ కష్టపడటం ఇష్టం ఉండేది కాదు. చివరకు, గురువు వద్ద క్రమశిక్షణతో విధ్యాభ్యాసం చెయ్యటం కూడా ఇష్టంలేక పోవటం చేత అతనికి చదువు కూడా అంట

## బేతాళ కథలు



లేదు. ఆస్తిపాస్తులు దండిగా ఉన్నవి గనక తల్లిదండ్రులు కూడా అతన్ని నిర్బంధించక, యథేచ్ఛగా వదిలేశారు.

ఈడు వచ్చేసరికి మాధవుడికి నగరవాసం మీద మోజు మళ్ళింది. అందుచేత అతను తన తల్లిదండ్రులను ఒప్పించి, గ్రామంలో తమకుగల ఆస్తుల నన్నిటినీ అమ్మేసి, ఆ డబ్బుతో విక్రమసింహపురికి చేరుకున్నాడు. అక్కడ అతను మంచి ఇల్లు కొని మిగిలినదానితో వర్తకం చేదామనుకున్నాడు. అందుకై బోలెడంత సరుకు కూడా కొన్నాడు.

కాని దురదృష్ట వశాన ఒకనాటి రాత్రి అతని ఇల్లు అంటుకుని, పూర్తిగా కాలిపోయింది. మాధవుడు ఆ మంటల నుంచి ఎలాగో బయటపడ్డాడు గాని, ఇంటితోపాటు అతని తల్లిదండ్రులూ, వ్యాపారం నిమిత్తం కొన్న సరుకూ పోయింది. సంపన్నుడైన మాధవుడికి ఇంత బూడిదా, కట్టుబట్టలూ తప్ప ఇంకేమీ మిగలలేదు. అడుక్కు తినటం తప్ప మాధవుడికి మరొక బతుకు తెరువు లేదు.

ఏమీలేకపోయినా మాధవుడికి మానాభిమానాలు పుష్కలంగా ఉన్నాయి. అందుచేత అతను నదిలోపడి ఆత్మహత్య చేసుకుని తన జీవితసమస్య తేల్చుకుందా మనుకున్నాడు. అతను అర్ధరాత్రివేళ పెన్నా నదికి వెళ్ళాడు.

ఆ చీకటిలో ఒక చెట్టు కింది నుంచి, "ఎవరు, నాయనా, నువు? ఏం చెయ్యబోతున్నావు?" అన్న ప్రశ్న వినిపించింది.

మాధవుడు ఆ చెట్టు వద్దకు వెళ్ళేసరికి, అక్కడ ఒక ముని కనిపించాడు. మాధవుడు ఆయనకు తన కథ చెప్పబోయాడు. ముని అతన్ని చెప్పనియ్యక, "నీ కథ అంతా నాకు తెలుసును. ఎలా బతకాలో తెలియక నువు నదిలో దూకి ప్రాణత్యాగం చెయ్యాలనుకుంటున్నావు. కాని నీ ప్రయత్నం ఫలించదు," అన్నాడు.

"ఎందువల్ల, స్వామీ?" అని మాధవుడు ఆశ్చర్యంతో అడిగాడు.

"నీకు పూర్తిగా నూరేళ్ళ ఆయుర్దాయం రాసిపెట్టి ఉన్నది. నూరేళ్ళు నిండిన దాకా మృత్యుదేవత నీ కేసి చూడలేదు," అన్నాడు ముని.

ఈ మాట విని సంతోషించటానికి బదులు మాధవుడు ఆందోళన చెంది, "నాకు ఒక్క పూట ఎలా గడపాలో తెలీదు. నూరేళ్ళు ఎలా గడపను? జీవితం నాకు నరకం. నూరేళ్ళ దీర్ఘనరక ప్రాయమైన జీవితం అనుభవించక తప్పదా నాకు?" అని మునిని అడిగాడు.

ముని కొంచెంసేపు ఆలోచించి, "ధనం లేకుండా నువు బతకలేవన్నమాట. నీకు ధనార్జన చేసే ఉపాయం చెబుతాను. ఒక మంత్రం ఉపదేశిస్తాను. ఆ మంత్రం పఠించి, చచ్చిపోయిన వారికి నీ ఆయుర్దాయంలో నీకు తోచినంత ఇస్తే వాళ్ళు బతుకుతారు. ఇలా నీ పూర్ణాయుర్దాయంలో కొంత నువు ఇతరులకు విక్రయించావంటే నీకు పుష్కలంగా ధనం దొరుకుతుంది. కాని నువు దానం చేసిన మేరకు నీ ఆయువు తరిగిపోతుంది," అన్నాడు.

ముని చెప్పినది నిజమైన పక్షంలో తన జీవితసమస్య తీరినట్టే ననుకుని మాధవుడు ఆ ముని వద్ద మంత్రోపదేశం పొంది, ప్రాణ విక్రయం చేసుకుని బతకటానికి బయలు దేరాడు.



తెల్లవారే సరికి అతను ఒక గ్రామం చేరాడు. గ్రామంలోని ధనికుడి ఇంటి ముందు జనం పోగయారు. క్రితం రాత్రి ధనికుడు గుండెపోటుతో చనిపోయాడు.

మాధవుడు ధనికుడి అప్తులను కలుసు కుని, "నేను ఈయనను బతికిస్తాను. నాకేమి ఇస్తారు?" అని. అడిగాడు.

మొదట అతని మాటను ఎవరూ నమ్మ లేదు.

"నేను బతికించలేకపోతే మీకు వచ్చే నష్టం ఏ మున్నది? బతికిస్తే ఎంత ఇస్తారో చెప్పండి," అన్నాడు మాధవుడు.

"లక్షవరహాలు ఇస్తాం! చేతనైతే బతి కించు!" అన్నారు ధనికుడి బంధువులు.



మాధవుడు కాళ్ళూ, చేతులూ కడుక్కొని వచ్చి, ఒక ప్రాతలో నీరు పట్టుకుని శవం పక్కన కూర్చుని, మంత్రం చదువుకుని, చచ్చిన వాడికి తన ఆయుర్దాయం నుంచి ఒక సంవత్సరం ధారపోశాడు. అతని చేతి నీళ్ళు మీదపడగానే శవం కదిలింది. కొద్ది సేపట్లోనే ధనికుడు పిడిరాయి లాగా లేచి కూర్చున్నాడు.

ధనికుడి బంధువుల సంతోషానికి మేర లేదు. వాళ్ళు మాధవుడికి ధనం ఇవ్వటమే గాక, బట్టలూ, వస్తువాహనాలూ ఇచ్చి, దేవుణ్ణి పూజించినట్టు పూజించారు.

మాధవుడు తిరిగి నగరం చేరుకున్నాడు. అతని కీర్తి అతిత్వరలోనే చాలా దూరం పాకింది. అతని ఇంటికి రోజూ మేనాల లోనూ, బళ్ళమీదా శవాలు రాసాగాయి. మాధవుడి ప్రాణవ్యాపారం జోరుగా సాగింది. అతని మీద కనకవర్షం కురుస్తున్నది. డబ్బు ఇవ్వలేనివాళ్ళు కూడా ప్రాణదానం అడుగు తున్నారు.

మాధవుడు కోటీశ్వరుడయాడు. కాని ప్రాణవిక్రయం రోజు రోజుకూ ఉధృత మవుతున్నది. ఇప్పుడతను డబ్బు తీసుకుని కొద్దిరోజుల ఆయువు మాత్రమే ఇస్తున్నాడు. అతను ఎంత ఆయువు అమ్ముతున్నదీ అతనికి మాత్రమే తెలుసు. పై వాళ్ళకు తెలిసినది చచ్చినవాళ్ళు తిరిగి బతకటమే.

ఈ స్థితిలో అతను తగిన కన్యను చూసి పెళ్ళాడాడు. అయితే పెళ్ళి అయిన కొద్ది రోజులకే మాధవుడి భార్య చనిపోయింది. మాధవుడు ఆమెకు తన ఆయువు ఇవ్వ లేదు. అతను ఆమెకు శాస్త్రోక్తంగా అంత్య క్రియలు చేసి, ఆమెను దహనం చేసి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఎవరి నెవరినో బతికించిన మాధవుడు తన భార్యను బతికించుకోలేక పోవటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. అతని శక్తులు పోయాయని అందరూ అను కున్నారు.

అటు తరవాత అతని వద్దకు ఎవరన్నా శవాలను తెస్తే, అతని సమీపంలో ఉన్న

వాళ్ళు. "తన భార్యనే బతికించుకోలేక పోయాడు. ఎందుకు ఆయనను బాధిస్తారు?" అని చెప్పి పంపేశారు.

క్రమంగా మాధవుడి వద్దకు శవాలు రావటం మానేశాయి. తరవాత అతను దాదాపు ఎనభైఏళ్ళ వయసు నిండిన దాకా నిశ్చింతగా బతికాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. మాధవుడు ఎవరినెవరినో బతికించి, తన భార్యను ఎందుకు బతికించ లేదు? ఆమెను బతికించటం వల్ల తనకు ఎవరూ డబ్బు ఇయ్యరనా? లేక ఆమె మీద ప్రేమలేకనా? ఆమెను చావనిచ్చి మాధవుడు తనకున్న కీర్తి ప్రతిష్ఠలను కూడా ఎందుకు పోగొట్టుకున్నట్టు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మాధవుడు చేసినది వ్యాపారం. దానికి మూలధనం అతని ఆయువు. అది పరిమితమైనది. అతను మొదలు చెడిన బేరం ఎలా చెయ్య గలడు? అతను డబ్బుకోసం వ్యాపారం చేశాడు గాని కీర్తికోసం చెయ్యలేదు. తాను కోరినంత డబ్బు వచ్చినాక అతనికి వ్యాపారం గిట్టుబాటు కాదు. కాని కీర్తి అతని వ్యాపారాన్ని ఆగనివ్వలేదు. కీర్తి అతని పాలిటికి శత్రువే అయింది. అపకీర్తి వస్తే తప్ప అతను తన ఆయుర్దాయాన్ని కాపాడుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఆ పరి స్థితిలో అతనికి భార్య మరణం సంప్రాప్త మయింది. భార్యమీద ప్రేమ ఉండినా కూడా అతను ఆమెకు ప్రాణదానం చెయ్య టానికి లేదు. ఆమెకు ప్రాణదానం చెయ్యట మంటే తనకు మాలిన ధర్మమే. అందుచేత తాను నాలుగుకాలాలపాటు బతికి ఉండ గలందులకు మాధవుడు భార్యనూ, దిక్కు మాలిన కీర్తినీ ఒక్కసారిగా త్యాగంచేశాడు. లేకపోతే ప్రాణవ్యాపారంతో అతనే చచ్చి పోయి ఉండును," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# మీసం విలువ

ఒక గ్రామంలో ఒక కులీనుడైన ధర్మాత్ముడు ఉండేవాడు. ఆయన వల్ల ఉపయోగం పొందనివాడు ఆ గ్రామంలో లేడు. దానధర్మాలతో ఆయనకున్నదంతా హరించుకు పోయింది. తినటానికి కూడా లేని పరిస్థితిలో ఆ కులీనుడు ఊరి కోమటి వద్దకు వచ్చి, "శెట్టిగారూ, పాతిక రూపాయలు అప్పు కావాలి. తాకట్టు పెట్టటానికి నా దగ్గిర ఏమీ లేదు. నా మీసం వెంట్రుక తాకట్టు పెట్టుకుని డబ్బు అప్పు ఇవ్వండి," అన్నాడు.

కోమటి వెంటనే కులీనుడికి డబ్బిచ్చి పంపేశాడు.

అది చూసి, కోమటి దగ్గిర పని చేసే వెంకడు అనేవాడు, "అయనకు ఒక మీసం వెంట్రుకకు పాతిక రూపాయ లిచ్చారు. నా మీసమంతా ఇస్తాను, వంద రూపాయ లియ్యండి," అన్నాడు.

"ఒరే, ఇప్పుడు మీసాల ధర పడిపోయింది. ఒకప్పుడు ఈ ధర్మాత్ముడు నా మీసం వెంట్రుకను నూరు రూపాయ లిచ్చి కొన్నాడు. ఇప్పుడు మీసం వెంట్రుక ధర పాతిక రూపాయలే. కావలిస్తే నీకు నా మీసం వెంట్రుకలు పదేసి రూపాయల కిస్తాను. వాటిని పాతికేసి రూపాయలకు అమ్ముకుని లాభం చేసుకో," అన్నాడు కోమటి.

—ఎం. తిప్పయ్య





# ఉపాయం

తాష్కెంటు నగరంలో మీర్‌కమల్ అనే వ్యాపారి ఉండేవాడు. వాడూ, వాడి భార్య జమీరా తిండి కోసం వాళ్ళనూ, వాళ్ళనూ యాచించేవారు. వారికి పిల్లలు లేరు. డబ్బు ఖర్చు చెయ్యకుండా పొట్టనింపుకోవటం తప్ప వారికి మరో ఆశయం ఏదీలేదు.

మీర్‌కమల్ వారానికి ఆరు రోజులు అమ్మకం మీద తిరిగి, బుధవారాలు మాత్రమే ఇంటి దగ్గిర ఉండేవాడు.

ఒక బుధవారంనాడు జమీరా కంటతడి పెట్టుకుని తన భర్తతో, "నువు ఏమన్న మొగిడివి? ఈ దిక్కుమాలిన కొంపలో ఒంటరిగా ఉంటే నాకు మతి పోతున్నది. నాకు తోడుగా ఉండటానికి ఒక దూడనో, గొర్రెనో కొంటే మిన్ను విరిగి మీద పడుతుందా?" అన్నది.

మీర్‌కమల్ రెండేళ్ళవయసుగల బక్క చిక్కిన గొర్రెను చౌకగా కొని తెచ్చాడు.

జమీరాకు తోచకపోవటమనే సమస్య పోయింది. ఆ గొర్రె అస్తమానమలా అరుస్తూ, అరవకపోతే దగ్గుతూ, ఆ చుట్టుపక్కల మెయ్యటానికి ఉన్నదంతా మేసేసింది.

మళ్ళీ బుధవారం నాడు మొగుడు ఇంటికి రాగానే జమీరా కంట తడిపెట్టుకుని, "నా ప్రాణం మీదికి ఈ గొర్రెను ఎందుకు తెచ్చావు? నేను నాలుగుకాలాల పాటు బతకాలని నీకు లేదల్లే ఉంది! దీన్ని పంపేస్తావా, లేక నన్ను పుట్టింటికి వెళ్ళిపొమ్మన్నావా?" అని అడిగింది.

"నువు తొందరపడి వెళ్ళిపోకు. ఈ గొర్రె సంగతి నేను చూస్తాను," అన్నాడు మీర్‌కమల్ తన భార్యతో.

ఆ రోజే అతను తన తల్లి సమాధికి దణ్ణం పెట్టుకు రావటానికి గోరీలుండే చోటికి వెళ్ళాడు. అక్కడ పచ్చిక ఏపుగా పెరిగి, నవనవలాడుతున్నది. తన గొర్రెకు

ఉజ్బెక్ జానపద కథ

ఇంతకన్న మంచి విందు ఉండదను కున్నాడు మీర్‌కమల్.

అతను గబగబా ఇంటికి వెళ్ళి, తన గొర్రెతోసహా గోరీలసంరక్షకుడి వద్దకు వచ్చి, అతనితో, "అన్నా, పెద్దవాడినై పోయాను. నాకు పిల్లా జెల్లాలేరు. అల్లా పిలిచినప్పుడు నన్ను నువే పాతిపెట్టాలి. అందుకుగాను నీకు డబ్బు ఇచ్చుకోవటానికి నా వారసు లెవరూ లేరు. కనక ఇప్పుడే ఈ గొర్రెను నీకు ఇచ్చుకుంటున్నాను," అన్నాడు.

అందుకు గోరీల సంరక్షకుడు అభ్యం తరం చెప్పలేదు.

రెండు నెలలు గడిచాయి. ఒకనాడు మీర్‌కమల్ గోరీల వద్దకు వచ్చి, తన గొర్రెను చూసి గుర్తించలేక పోయాడు. అది తెగబలిసి, కొవ్వుపట్టి ఉన్నది.

"దీని బరువు రెండు మణుగులకు పైనే ఉంటుంది. ఇంత లావు గొర్రెను దానం చెయ్యటం కన్న బుద్ధి తక్కువ ఉండదు. దీన్ని పట్టుకు పోవలిసిందే!" అనుకున్నాడు మీర్‌కమల్.

వాడు తిన్నగా గోరీలసంరక్షకుడి ఇంటికి వెళ్ళి, తలుపు తట్టి, సలాం కొట్టి, "ఛీ, ఛీ, నా బతుకు చట్టుబండలయింది. ఒక గ్రామంలో కుర్రాడికి తడపర వస్తే అర చెంచాడు రసకర్పూరం ఇచ్చాను. వాడు కాస్తా చచ్చాడు. నన్ను తాష్కెంటునగరం విడిచిపొమ్మన్నారు. నువు తట్టా, బుట్టా సర్దుకుని ప్రయాణం కా!" అన్నాడు.

"నే నెక్కడికి?" అని ఆశ్చర్యంగా అడిగాడు గోరీలసంరక్షకుడు.

"ఎక్కడి కేమిటి? నాతోపాటు ప్రవా సానికి. నేను చస్తే పూడ్చిపెట్టటానికి ఒప్పు కున్నావు గద! అందుకు గాను నీకు గొర్రెను ఇచ్చాను కూడా గద! నేను ఎక్కడ చస్తే అక్కడ నువు ఉండి, నన్ను పూడ్చవద్దా మరి?" అన్నాడు మీర్‌కమల్.

"ఛా! నువు నీ యిష్టం వచ్చిన చోట చావు. నువూ నీ గొర్రే కలిసి ఏట్లో దూకండి!" అన్నాడు గోరీలసంరక్షకుడు.

మీర్‌కమల్ తన గొర్రెను తీసుకుని, ఆడుతూ పాడుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.





# సూక్ష్మ బుద్ధి

ఒక ఊళ్ళో జమీందారు వద్ద ఎల్లమ్మ అనే ఆవిడ పరిచారికగా ఉండేది. చనిపోయిన ఆమె భర్త కూడా ఆ జమీందారుగారి వద్ద పనిచేసిన వాడే.

ఎల్లమ్మకు సింగన్న అని ఒక కొడుకు ఉండేవాడు. వాడు తెలివిగల వాడే, కాని వట్టి సోమరి.

సింగన్న భవిష్యత్తు గురించి ఎల్లమ్మకు విచారం పట్టుకున్నది. ఆమె వాడితో, "నీకు ఏ పనీ రాదు. ఏ పనీ నేర్చుకోవు. ఇలా ఉంటే ముందు ముందు నీ గతి ఏం కాను? ఏదైనా పనిలో ప్రవేశించరా," అన్నది.

తల్లి చెప్పినది నిజమేనని తోచి, సింగన్న, "నా తండ్రి జమీందారుగారి దగ్గిర పని చేశాడు. నాక్కూడా అక్కడే పని ఇప్పించు," అన్నాడు.

ఎల్లమ్మ సంతోషించి, వెళ్ళి జమీందారుతో ఆ మాట చెప్పింది.

జమీందారు సింగన్నను పనిలో పెట్టుకోవటానికి ఒప్పుకుంటూ, "వాడికి ఏ పనీ రాదంటున్నావు. అయినా నిన్ను గురించీ, నీ భర్త గురించీ వాడికి ఏదోపని ఇస్తాను. వాణ్ణి తీసుకురా," అన్నాడు.

మర్నాడు ఎల్లమ్మ సింగన్నను జమీందారు దగ్గిరికి తీసుకుపోయింది.

జమీందారు వాడితో, "నువు ప్రస్తుతం మా గేదెలను కాస్తూ ఉండు. జాగ్రత్త సుమా! గేదె ఖరీదు అయిదు వందలు. ఒక గేదె తప్పి పోయిందంటే అయిదు వందలు వసూలు చేస్తాను," అన్నాడు.

గేదె ఖరీదు అంత ఉండదు; కాని అలా అంటేనేగాని తన కొడుక్కు పని మీద శ్రద్ధ ఉండదని జమీందారు ఆ మాట అన్నట్టు అర్థం చేసుకున్నది ఎల్లమ్మ.

తరవాత సింగన్న కొన్ని రోజులపాటు జమీందారుగారి గేదెలను మేపుతూ

టి. హయగ్రీవాచారి

వచ్చాడు. కాని వాడికి ఆ పని ఏ మాత్రమూ నచ్చలేదు. వాడికి కొంత చదువూ, లెక్కలూ వచ్చును. అందుచేత జమీందారుగారు వాడికి ఇంతకన్న కాస్త మంచి పని ఇయ్య వచ్చు. కాని తాను ఇంతకన్న తెలివైన పని చెయ్యగలడని జమీందారుగారికి ఎలాగైనా తెలియబరచాలి. అందుకు వాడొక ఆలోచన చేశాడు..

ఒకనాడు సింగన్న జమీందారుగారి గేదెలను కాసేపని మరొక కుర్రవాడికి అప్పగించి, ఆ పని చూసినందుకు వాడికి కొంచెం పప్పూ, బెల్లమూ పెట్టి, ఒక గేదెను మాత్రం తోలుకుని పక్క గ్రామానికి వెళ్ళాడు. దాని వీపుమీద, "ఒక రూపాయికి గేదె! కొనదలచినవారు సాయంత్రం మైదానానికి రావచ్చు." అని సుద్దముక్కతో రాసి, గేదెతో సహా మైదానం చేరాడు.

ఒక రూపాయతోనే గేదెను కొందామన్న ఆశతో మైదానం మీద దాదాపు రెండువేల మంది చేరారు. సింగన్న వాళ్ళతో, "మీరంతా గేదెను కొందామని వచ్చారు. కాని ఒక్క గేదెను ఇంత మందికి అమ్మాలంటే చీటీ వేసి, ఎవరి పేరు వస్తే వారికి గేదెను అమ్ముతాను. చీటీ కట్టదలచిన వారు నాకు రూపాయ రూపాయ చొప్పున ఇవ్వండి," అన్నాడు.

అందరూ సింగన్నకు తాము తెచ్చిన రూపాయలు ఇచ్చారు. సింగన్న అందరి పేర్లూ చీటీల మీద రాసుకుని, వారిలోనే ఒకరిచేత చీటీ తీయించి, ఆ పేరు వచ్చిన వాడికి గేదెను ఇచ్చేసి, రెండువేల రూపాయలూ పట్టుకుని యజమాని వద్దకు వెళ్ళి, "మీ గేదె పోయింది. ఇదుగో డబ్బు," అని తాను సంపాదించిన డబ్బంతా యజమాని ముందు పెట్టి, జరిగిన సంగతంతా చెప్పాడు.

జమీందారు ఆశ్చర్యపడి, "నీకు బుద్ధి ఉందిరా. నువ్వు ఇక గేదెలను కాయకు," అని, సింగన్నకు కొంత డబ్బు బహుమానంగా ఇచ్చి, వాణ్ణి తన లెక్కలు చూడటానికి పెట్టుకున్నాడు. తన కొడుకు తెలివితేటలు అక్కరకు వచ్చినందుకు ఎల్లమ్మ కూడా సంతోషించింది.





# రాములుకు శాస్తి

కృష్ణానదీతీరాన ఒక గ్రామంలో రాములూ, చంద్రూ అని ఇద్దరు రైతులు ఉండేవారు. రాములు వట్టి సోమరీ, కపటీ, అసూయా పరుడూనూ. చంద్రూ కష్టించి పని చేసే వాడూ, నిష్కల్మషమైన మనసు కలవాడూ, స్నేహపాత్రుడూనూ. ఆ కారణం చేత చంద్రూ పొలాలు చక్కగా పండుతూ వచ్చాయి. అతను డబ్బు వెనక వేస్తూ వచ్చాడు. కాని రాములు మాత్రం పొలం పనికి ఒళ్ళు వంగక, తనలాటి సోమర్లతో చేరి వ్యర్థంగా కబుర్లాడుతూ, నష్టపోసాగాడు.

చంద్రూ తన దశ బాగా ఉండటం చూసుకుని, పొలం పని చూపటానికి కూలీలను నియోగించి బాతుగుడ్ల వ్యాపారం ప్రారంభించాడు. అందులో కూడా అతనికి బాగా కలిసి వచ్చింది.

రాములుతో అతని మిత్రులు కొందరు, "చంద్రూ బాతుగుడ్ల వ్యాపారం పెట్టి, రెండు చేతులా సంపాదిస్తున్నాడు. నీకు వ్యవసాయం అచ్చిరావటం లేదు. నువు కూడా బాతుగుడ్ల వ్యాపారం పెట్టి చూడ రాదూ?" అంటూ సలహా ఇచ్చారు. రాములు చంద్రూ ఇంటికి వెళ్ళి బాతు గుడ్ల వ్యాపారం వైనం అడిగాడు. చంద్రూ దాపరికం లేకుండా రాములుకు అంతా చెప్పాడు.

రాములు కొన్ని బాతులను కొన్నాడు. కాని వాటి పోషణ సరిగా చేసే ఓపిక అతడికి లేకపోయింది. ఆ కారణం చేత రాములు కొన్న బాతులు తగినన్ని గుడ్లు పెట్టలేదు. చంద్రూ పెంచే బాతులు ఆరోగ్యంగా ఉండి చాలా ఎక్కువ గుడ్లు పెట్టాయి.

బజారులో చంద్రూ దుకాణం సరసనే రాములు కూడా తన దుకాణం పెట్టాడు. రాములు దురాశాపరుడు కావటం చేత,

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



అవకాశం దొరికినప్పుడల్లా చంద్రూ తట్టలో నుంచి గుడ్లు కాజేస్తూ ఉండేవాడు.

రాములు ప్రతిరోజూ తన గుడ్లు దొంగిలిస్తూ ఉంటే, ఒకనాడు చంద్రూ అతన్ని పట్టుకుని, ఇలా మరెన్నడూ చెయ్యవద్దని హెచ్చరించాడు. కాని రాములు చంద్రూ గుడ్లను దొంగిలించటం మానలేదు.

చంద్రూ వెళ్ళి న్యాయాధికారి వద్ద రాములు మీద ఫిర్యాదు చేస్తూ, రాములు తన తట్ట నుంచి ఇరవై గుడ్లు దొంగిలించాడని చెప్పాడు. ఆ గుడ్లన్నీ తన బాతులు పెట్టినవేనని రాములు న్యాయాధికారితో అన్నాడు. దొంగతనం రుజువు కానందున న్యాయాధికారి ఫిర్యాదును కొట్టివేశాడు.

చంద్రూ విచారంగా ఇంటికి వెళ్ళాడు. అతని భార్య అతనితో, "దిగులు పడి కూర్చుంటే ఏం లాభం? ఆ దొంగ వెధవను శిక్షించే మార్గం ఏదన్నా చూడు." అన్నది.

"ఎంత ఆలోచించినా నాకు దారి కనిపించటం లేదు," అన్నాడు చంద్రూ.

"మన గణపతిమామయ్య తంత్రాలకు పెట్టినది పేరు. వెళ్ళి అడిగితే, ఆయన ఏమన్నా సలహా చెబుతాడేమో?" అన్నది చంద్రూ భార్య.

"నిజమే. రేపు ఆయనతో మాట్లాడతాను," అన్నాడు చంద్రూ.

మర్నాడు ఉదయమే చంద్రూ గణపతి వద్దకు వెళ్ళి తన సమస్య వివరించాడు.

గణపతి కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి, "ఒరే, అబ్బీ, నేను చెప్పినట్టు చేశావంటే దొంగ సులువుగా దొరికిపోతాడు," అంటూ ఒక ఉపాయం చెప్పాడు.

గణపతిమామ వద్ద సెలవు పుచ్చుకుని చంద్రూ ఇంటికి తిరిగి వస్తూ, దారిలో పచారీ దుకాణంలో ఏవో దినుసులు కొని, ఇంటికి వచ్చి, ఒంటరిగా గదిలో కూర్చుని ఏదో చేశాడు.

చంద్రూ తన గుడ్లను తీసుకుని దుకాణానికి వెళ్ళేసరికి కాస్త ఆలస్యమయింది. అతను దుకాణం తెరిచి, గుడ్ల తట్టను

దుకాణంలో పెట్టి, మంచి నీరు తాగి రావటానికి అలా అవతలికి వెళ్ళాడు. అతను తిరిగి వచ్చేలోగా రాములు అతని తట్ట నుంచి కొన్ని గుడ్లు కాజేశాడు.

చంద్రూ తిరిగి వస్తూనే దొంగతనం గుర్తించి, "దొంగ, దొంగ!" అని కేకలు పెట్టాడు. ఈ కేకలతో రక్షకభటుడు ఒకడు వచ్చి, "ఏం జరిగింది?" అని చంద్రూను అడిగాడు.

"ఈ రాములు నా గుడ్లు కాజేశాడు," అన్నాడు చంద్రూ.

"ఛీ, ఛీ! అంతా అబద్ధం!" అన్నాడు రాములు.

"ఏమిటిది, చంద్రయ్యా? వెనక ఒక సారి ఇలాగే ఫిర్యాదు చేశావు, కాని రుజువు చెయ్యలేక పోయావు." అన్నాడు రక్షక భటుడు.

"ఈ సారి రుజువు చేస్తాను." అన్నాడు చంద్రూ.

రాములూ, చంద్రూ తమ సరుకుతో సహా, రక్షకభటుడి వెంట న్యాయస్థానానికి వెళ్ళారు. చంద్రూని చూసి న్యాయాధికారి, "మళ్ళీ వచ్చావా?" అన్నాడు.

"రాములు తన గుడ్లు దొంగిలించాడని చంద్రూ అంటున్నాడండి," అని రక్షక భటుడు న్యాయాధికారికి చెప్పాడు.

"రుజువేమిటి?" అని న్యాయాధికారి అడిగాడు.

"రాములు పచ్చిగుడ్లు అమ్ముతాడండి. అతని తట్టలో ఉడకబెట్టిన గుడ్లు ఎందు



కున్నాయో తమరు విచారించండి. ఇవాళ నేను పని పెట్టుకుని ఉడకబెట్టిన గుడ్లు తెచ్చాను,'' అన్నాడు చంద్రూ.

''మిత్రులు కావాలంటే నేను కూడా కొన్ని గుడ్లు ఉడికించి తెచ్చుకున్నానండి,'' అన్నాడు రాములు.

చంద్రూ న్యాయాధిపతితో, ''తమరు అతని బుట్టలో ఉన్న ఉడికిన గుడ్లు ఒలిపించినట్టయితే లోపల నా పేరు కనబడుతుంది. కావలిస్తే తమరు పరీక్ష చెయ్యండి,'' అన్నాడు.

''అలాగే,'' అంటూ న్యాయాధికారి రాములు తట్టలో ఉన్న ఉడికిన గుడ్లను ఏరి వాటిపై పెంకు ఒలిపించాడు. పెంకు అడుగున ప్రతి గుడ్డు మీదా చంద్రూ పేరు స్పష్టంగా రాసి వున్నది.

చంద్రూ నవ్వుతూ, ''రాములు తన గుడ్ల మీద నా పేరు కనబడేటట్టు చెయ్యటానికి ఏం గారడీ చేశాడో చెప్పమనండి. తలవంచుకుని నా దారిన నేను పోతాను,'' అని న్యాయాధికారితో అన్నాడు.

రాములు దొంగతనం చేశాడని నమ్మకం కుదిరి, న్యాయాధికారి అతనికి జైలు శిక్ష విధించాడు. చంద్రూ సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చి, ''రాములుకు తగిన శాస్తి చేశాను,'' అని భార్యతో అన్నాడు.

''ఎలా జరిగింది?'' అని భార్య అడిగింది. రాములు దొంగిలించిన తన గుడ్ల పెంకుల దిగువ తన పేరు ఉండటంతో దొంగతనం రుజువైన సంగతి చంద్రూ తన భార్యకు చెప్పాడు.

''అసలు గుడ్ల పెంకు కింద నీ పేరు ఎలా వచ్చింది?'' అని భార్య అడిగింది.

''అదా? అది గణపతిమామ చెప్పిన యుక్తి. మామ దగ్గరనుంచి వచ్చేటప్పుడు నేను కొంచెం శంఖద్రావకమూ, పటికా కొనుక్కొచ్చాను. నేను గదిలో కూర్చుని ఏం చేశాననుకున్నావు? శంఖద్రావకంలో పటిక రంగరించి, దానితో గుడ్లమీద నా పేరు రాశాను. అది ఆరిపోయాక ఆ గుడ్లను నువు ఉడక బెట్టావు. అంతే నేను చేసింది,'' అన్నాడు చంద్రూ.





# కీలుగుర్రం

చాలా కాలం క్రితం పర్షియా దేశాన్ని సాబూర్ అనే శక్తిమంతుడైన రాజు పాలించేవాడు. ఆ కాలపు రాజులందరిలోకీ ఆయన ఎక్కువ సంపదా, వివేకమూ గలవాడు. అంతేగాక ఆయన గొప్ప దాత; అడిగిన వారికి ఎన్నడూ లేదనేవాడు కాడు. పేదలకూ, విదేశీయులకూ ఆయన చూపే ఆదరం ఇంతా అంతా కాదు. కాని ఆయన న్యాయనిర్ణయం చేసేటప్పుడు ఎలాటి దయాదాక్షిణ్యాలూ చూపక, నేరస్థులను క్రూరంగా శిక్షించేవాడు.

సాబూర్ రాజుకు చంద్రబింబాల వంటి ముగ్గురు కుమార్తెలూ, ఒక కుమారుడూ ఉండేవారు. కొడుకు పేరు కమరల్ అక్మార్.

ఏటా రాజు తన ప్రజల కోసం రెండు మహోత్సవాలు జరిపేవాడు. నౌరోజ్ ఉత్సవం వసంతకాల అరంభంలో జరిగేది. మిహిర్గాన్ ఉత్సవం హేమంత రుతువులో జరిగేది. ఈ రెండు ఉత్సవాలకూ రాజసౌధం ద్వారాలు తెరిచి ఉండేవి; దాన ధర్మాలు జరిగేవి; కొత్త వారికి రాజుగారి వద్ద కొలువు దొరికేది; పాత ఉద్యోగులకు అభివృద్ధి కలిగేది. ఉత్సవం జరిగే రెండు రోజులూ పర్షియా అన్ని మూలలనుంచీ ప్రజలు వచ్చి, వినోదాలలో పాల్గొని, రాజుగారికి కానుకలు సమర్పించి, ఆయన నుంచి విలువైన రకరకాల బహుమానాలు పొందేవారు.

ఒక ఏడు నౌరోజ్ ఉత్సవం జరిగేటప్పుడు, సభ తీరి ఉన్న రాజుగారి వద్దకు ముగ్గురు విజ్ఞానులు వచ్చారు. వారు శాస్త్రజ్ఞానంలో నిధులు; తమ రహస్య జ్ఞానంతో పామరులను ఆశ్చర్యచకితులను చేయగలవారు. వారు ముగ్గురూ మూడు దేశాల నుంచి వచ్చిన వారు—ఒకడు హిందూ

దేశం నుంచి వచ్చాడు; మరొకడు రోమ్ నుంచి వచ్చాడు; మూడోవాడు మాత్రమే పర్షియా దేశానికి చెంది పార్సీభాష మాట్లాడ గలవాడు.

హిందూదేశం నుంచి వచ్చిన విజ్ఞాని రాజుగారికి వందనం చేసి ఆశీర్వదించి, ఒక అపూర్వమైన కానుక రాజుగారి ఎదట ఉంచాడు. అది ఒక మనిషి విగ్రహం. దాన్ని బంగారంతో తయారుచేసి, రత్నాలు పొదిగారు. ఆ విగ్రహం చేతిలో బాకా ఒకటి ఉన్నది.

"దీనివల్ల ఉపయోగం ఏమిటి?" అని రాజు విజ్ఞానిని అడిగాడు.

"మహారాజా, ఈ విగ్రహానికి గల శక్తే దీని ఉపయోగాన్ని స్పష్టం చేస్తుంది. మీ నగర ద్వారం వద్ద ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్టయితే, ఇది నిద్రాహారాలు కోరని పహరా ఇస్తుంది; శత్రువు వచ్చే పక్షంలో, ఇది దూరాన ఉండగానే ఆ శత్రువును పసికట్టి, బాకా ఎత్తి నోటివద్ద పెట్టుకుని ఊదుతుంది. ఆ బాకా ధ్వనికి క్షణాల మీద శత్రువులు కొయ్యబారి, భయంతో చచ్చి పోతారు," అన్నాడు హిందూదేశం నుంచి వచ్చిన విజ్ఞాని.

"మీరు చెప్పిన ఈ మాట గనక నిజమైతే మీరు ఏది కోరినా ఇస్తాను," అన్నాడు రాజు ఆయనతో.

తరవాత రోము నుంచి వచ్చిన విజ్ఞాని రాజుకు వందనం చేసి, ఆయన ముందు పెద్ద వెండి పళ్ళెం ఉంచాడు.



ఆ పళ్ళెం మధ్యలో ఒక బంగారు మగనెమలి ఉన్నది. దాని చుట్టూ ఇరవై నాలుగు బంగారు ఆడనెమళ్ళు ఉన్నాయి.

''మహాత్మా, ఈ నెమళ్ళ వల్ల ప్రయోజనం ఏమిటి?'' అని రాజు ఆయనను అడిగాడు.

''రాజా, గంట గంటకూ ఈ మగ నెమలి ఒక ఆడనెమలిని ముక్కుతో పొడిచి, పురివిప్పి నాట్యం చేస్తుంది. ఇలా రోజులో గల ఇరవై నాలుగు గంటలూ తెలిపే గడియారం ఈ పళ్ళెం. ఇంతే కాదు, నెల పూర్తి అయినప్పుడల్లా ఈ మగనెమలి నోరు తెరిచి, తన కంఠంలో గోరుచంద మామను చూపుతుంది.'' అన్నాడు రోము నుంచి వచ్చిన విజ్ఞాని.

''ఆహా, ఎంత గొప్ప అద్భుతం! లోకంలో యిలాంటిది సాధ్యమా? మీరన్నది నిజమైతే మీరు కోరినదంతా ఇస్తాను,'' అన్నాడు రాజు.

తరవాత పర్షియా దేశపు విజ్ఞాని ముందుకు వచ్చి, రాజుగారికి సలాము చేసి, లాంఛన సంభాషణల అనంతరం ఒక గుర్రాన్ని రాజుగారి ముందు పెట్టాడు. అది అరుదైన నల్లచేవమాను కర్రతో తయారు చేసి, బంగారూ, రత్నాలూ పొదిగినది. దాని మీద జీనూ, రికాబులూ, కళ్ళాలూ ఉన్నాయి. చూడటానికి అది చాలా అందంగా ఉన్నది.

దానివల్ల ఉపయోగమేమిటని రాజు విజ్ఞానిని అడిగాడు.





"మహారాజా, దీనిమీద ఎక్కినవాడు మనోవేగంతో ఆకాశగమనం ద్వారా ఎక్కడికి కావాలంటే అక్కడికి పోవచ్చును. మామూలు గుర్రం సంవత్సర కాలంలో చేసే ప్రయాణం ఇది సునాయాసంగా ఒక్క రోజులో చేస్తుంది," అన్నాడు పర్షియా దేశపు విజ్ఞాని.

"ఈ మాట నిజమే అయితే, మీరు ఎలాటి కోరిక కోరినాసరే తప్పక తీర్చుతాను," అన్నాడు రాజు.

ముగ్గురు విజ్ఞానులూ ఇచ్చిన కానుకలను రాజు మూడు రోజుల పాటు పరీక్షించాడు. హిందూ దేశస్థుడిచ్చిన బంగారు మనిషి బాకా ఊదగలడని రుజువయింది. రోము వాడి నెమళ్ళు గంటలు చూపాయి. పర్షియావాడు కొయ్యగుర్రం మీద ఎక్కి ఆకాశంలోకి లేచి, అతి వేగంగా ఆకాశంలో కొంతసేపు తిరిగి, నింపాదిగా నేల మీదికి దిగివచ్చాడు.

సాబూర్‌రాజు పొందిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. ఆయన విజ్ఞానులతో, "మహాత్ములారా, మీ ప్రతిభ అత్యద్భుతం, లోకోత్తరమైనది. మీమీ కోరికలు ఏమిటో తెలపండి. వాటిని తీర్చటం నా విధి," అన్నాడు సంతోషంగా.

వెంటనే వాళ్ళు ముగ్గురూ, "మహారాజా, మీరు మా కానుకలతో తృప్తి చెంది, మా కోరికలు తీర్చగోరుతున్నారు గనక, మాకు మీ ముగ్గురు కుమార్తెలనూ ఇచ్చి పెళ్ళిళ్ళు చెయ్యండి. మీ అల్లుళ్ళం కావటమే మా కోరిక," అన్నారు.

రాజు తడువుకోకుండా, "అలాగే చేస్తాను," అని, కాజీనీ, సాక్షులనూ పిలిపించాడు. వాళ్ళు రాజకుమార్తెల వివాహపత్రాలు రాయసాగారు.

ఇదంతా జరుగుతూ ఉండగా, పరదా వెనకనుంచి రాజకుమార్తెలు అంతా గమనిస్తూనే ఉన్నారు. రాజుగారి మూడవ కుమార్తె తనకు భర్తకాబోయే పర్షియా విజ్ఞానిని చూసి, ఆయనకు నూరేళ్ళూ నిండి ఉంటాయనుకున్నది. ఆయన చాలా ముసలి

వాడు. చూడటానికే ఒళ్ళు జలదరించేటట్టుగా ఉన్నాడు. ఇందుకు విరుద్ధంగా మూడో రాజకుమార్తె ముగ్గురిలోకీ ఎక్కువ అందమైనది. అలాటి తనను ఆ ముసలి పీనుగుకు కట్టబెడుతున్నా రనగానే ఆమె తన గదికి పరిగెత్తి, నేలమీద బోర్లాపడుకుని ఏడుస్తూ, తన బట్టలన్నీ చించుకుని, ముఖమంతా రక్కుకున్నది.

ఆమె ఈ స్థితిలో ఉండగా ఆమె అన్న అయిన కమరల్ అక్మార్ వేట నుంచి అప్పుడే తిరిగి వచ్చి, ఆమె గదినుంచి వచ్చే రోదన ధ్వని విని, ఆమెను సమీపించి, "ఏం జరిగింది? దాచకుండా త్వరగా చెప్పు," అన్నాడు.

"అన్నా, మన తండ్రి నన్నొక ముసలి మాంత్రికుడి కిచ్చి పెళ్ళి చేస్తానని మాట ఇచ్చాడు. వాడొక కొయ్యగుర్రాన్ని తెచ్చి, నాన్న మీద ఏదో మచ్చుమందు చల్లి, మతి పోగొట్టాడు. గత్యంతరం లేకపోతే నేను చావనన్నా చస్తాను గాని ఆ ముసలి మాంత్రికుణ్ణి మాత్రం పెళ్ళాడను," అన్నది రాజకుమార్తె.

కమర్ ఆమెను ఓదార్చి, ధైర్యం చెప్పి, తండ్రి వద్దకు వెళ్ళి, "ఏమిటిది? మీరు ఎవరో గారడీవాడికి నా చిన్న చెల్లెలిని ఇస్తానని మాట ఇచ్చారట. వాడు తెచ్చిన కానుక ఏమిటి? దాన్ని చూసి మీరు చిన్న పిల్లకు



ఇంతదుఃఖం ఎలా తెచ్చిపెట్టారు? ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు. జరిగితే పిల్ల అన్యాయంగా దుఃఖంతో చచ్చిపోతుంది," అన్నాడు.

కమర్ ఇలా అన్నప్పుడు కొయ్యగుర్రం తెచ్చిన ముసలాడు రాజు వద్దనే ఉండి, ఆగ్రహంతో కుమిలిపోయాడు. కాని రాజుగారు తన కొడుకుతో, "నాయనా, ఈ విజ్ఞానిని తెచ్చిన గుర్రాన్ని నువు చూస్తే ఇలా మాట్లాడవు," అన్నాడు.

ఆయన తన కొడుకును వెంటబెట్టుకుని ప్రాంగణంలోకి వచ్చి, కొయ్యగుర్రాన్ని తీసుకు రమ్మని తన భటులను ఆజ్ఞాపించాడు.

ఆ గుర్రం అందం చూసి కమర్ ముగ్ధు డయాడు. గుర్రపుస్వారీ అంటే అతనికి చాలా ఇష్టం. అందుచేత అతను వెంటనే గుర్రం మీద దూకి కూర్చుని, పాదాలు రికాబులలో దూర్చి, గుర్రం డొక్కలను మోకాళ్ళతో తట్టి అదిలించాడు. కాని గుర్రం కదలలేదు.

అప్పుడు రాజు విజ్ఞానితో, "గుర్రం ఎందుకు కదలటం లేదో చూడండి. మా వాడికి అది ఆకాశంలో ఎగిరే కిటుకు చెబితే మీ కోరిక సిద్ధించటం తథ్యం," అన్నాడు.

ముసలాడికి రాజుకొడుకు మీద చాలా కోపంగా ఉన్నది. ఆయన కమర్‌ను సమీ పించి, "జీను మీద కుడిపక్కన ఉన్న ఈ బంగారు మీట చూచావా? దీన్ని తిప్పితే మరుక్షణం గుర్రం గాలిలోకి లేస్తుంది," అన్నాడు.

తక్షణమే రాజకుమారుడు ఆ మీటను తిప్పాడు. వెంటనే గుర్రం ఆకాశంలోకి లేచింది. కొద్ది క్షణాలలోనే కమర్ కింద నుంచి చూసేవారికి కనిపించకుండా పోయాడు. ఎన్ని గంటలు గడిచినా అతని జాడ కనిపించలేదు.

రాజు ముసలాడితో, "మహాత్మా, మా వాణ్ణి తిరిగి భూమిమీదికి ఎలా తెప్పించటం?" అన్నాడు.

దానికి ముసలాడు, "అయ్యా, మీ కుమారుడు తిరిగి రావటం కల్ల. నేనేం చేసేది? కిందికి దిగి రావటానికి ఎడమ పక్కన మరొక మీట ఉన్నదని నన్ను చెప్ప నివ్వకుండా అతను వెళ్ళిపోయాడు. అర్ధ జ్ఞానం అనర్థం," అన్నాడు.

ఈ మాట విని రాజుకు భరించరాని ఆగ్రహం వచ్చింది. ఆ కోపంలో ఆయన, "ఈ ముసలాణ్ణి చావగొట్టి చీకటికొట్లో పడెయ్యండి," అని ఉత్తరువిచ్చి, శోకం పట్టలేక తన జుట్టు పీక్కుని, తలుపులన్నీ మూయించి, తన భార్యనూ, కుమార్తెలనూ, పరివారాన్నీ దగ్గిర పెట్టుకుని, శోకసము ద్రంలో మునిగిపోయాడు.

—(ఇంకావుంది)



# దురాశ

పూర్వం రామశర్మ అనే బ్రాహ్మణుడు దారిద్ర్యబాధకు తట్టుకోలేక బ్రహ్మను గురించి తపస్సు చెయ్యసాగాడు.

చాలా కాలానికి బ్రహ్మ ప్రత్యక్షమైనాడు.

"బ్రహ్మదేవుడా, నువు భక్తసులభుడ వంటారే. ప్రత్యక్షం కావటానికి ఇంత కాలం పట్టిందేం?" అని రామశర్మ బ్రహ్మను అడిగాడు.

"వత్సా, నా కాలమానం వేరు. మీకు ఒక యుగం అయితే నాకు ఒక రోజు. నేను ఒక క్షణంలోనే వచ్చాను," అన్నాడు బ్రహ్మ.

రామశర్మ కొంచెం ఆలోచించి, "మాకు కోటి రూపాయలు మీ లెక్కలో ఎంత?" అని బ్రహ్మను అడిగాడు.

"ఒక పైస," అన్నాడు బ్రహ్మ.

"అయితే నాకు నీ పైసా ఒకటి ఇప్పించు, స్వామీ," అని రామశర్మ వేడుకున్నాడు.

"ఒక నిమిషంలో తెచ్చి ఇస్తాను," అని బ్రహ్మ అదృశ్యమైపోయాడు.

— వారణాసి గోపీచంద్





# ఆస్తికోసం

జి. లక్ష్మీనరసింహారావు

ఒక గ్రామంలో శివయ్య అనే రైతు ఉండే వాడు. అతడు కొంచెం ఆస్తిపరుడే. అతనికి ముగ్గురు కొడుకులు. ముగ్గురూ తండ్రికి వ్యవసాయంలో సాయపడేవారు.

కొడుకులకు యుక్త వయసు రాగానే శివయ్య వారికి వివాహాలు చేసి, వ్యవసాయ భారమంతా వారికి అప్పగించాడు.

కోడళ్ళు కాపరానికి రాగానే శివయ్య జీవితం పూర్తిగా మారిపోయింది. ఆయన ఉదయం లేవగానే ఒక కోడలు ముఖం కడుక్కోవడానికి నీళ్ళూ అవీ తెచ్చి ఇచ్చేది. శివయ్య ముఖం కడుక్కోవటం పూర్తి చేసేసరికల్లా ఇంకో కోడలు ఫలహారం తెచ్చి ఇచ్చేది. ఫలహారం పూర్తి అయేసరికి మూడో కోడలు వీధి అరుగు మీద పురాణ గ్రంథమూ, వ్యాసపీటా పెట్టేది.

ఈ విధంగా కోడళ్ళు శివయ్యకు ఏలోటూ లేకుండా చూస్తున్నారు; కొడుకులు వ్యవసాయం చేసి, రాబడి అంతా తెచ్చి శివయ్య చేతిలో పోస్తున్నారు.

తనవంటి సుఖజీవి ప్రపంచంలో మరొకడు ఉండడని శివయ్య అనుకునే వాడు. వీధి అరుగు మీద కూర్చుని పురాణం చదువు కునేటప్పుడు ఎరిగినవారు ఎవరైనా అటుగా వెళ్ళితే, వారిని పిలిచి పక్కన కూర్చో బెట్టుకుని, తనకు కాలం ఎంత సుఖంగా వెళ్ళి పోతున్నదో చెప్పుకునేవాడు.

ఇలాగే ఒకనాడు శివయ్య తన మిత్రుడైన రంగయ్యతో, తనను తన కొడుకులూ, కోడళ్ళూ ఎంత సుఖపెట్టుతున్నదీ చెప్పుకున్నాడు.

అంతా విని రంగయ్య, "నువు ఇంకొక్క పని చేశావంటే నీ భారం పూర్తిగాపోయి మరింత సుఖపడతావు. అదేమిటంటే, నీ ఆస్తి నీ కొడుకులకు నీ చేతిమీదుగానే న్యాయంగా పంచిపెట్టు. లేకపోతే నీ అనం

తరం ఆస్తి పంచుకునేటప్పుడు వాళ్ళమధ్య తగువులు రావచ్చు." అని చెప్పి వెళ్ళి పోయాడు.

శివయ్య తన మిత్రుడిచ్చిన సలహా గురించి ఆ రాత్రి బాగా ఆలోచించి, అది మంచిదేనని నిశ్చయించి, తనకున్న యావ దాస్తినీ తన ముగ్గురు కొడుకులకూ సమంగా పంచి ఇచ్చేశాడు.

ఇది జరిగిన మర్నాటి నుంచీ శివయ్య జీవితంలో అతడూహించని మరొక పెద్ద మార్పు వచ్చింది.

కోడళ్ళు శివయ్యను గురించి పట్టించు కోవటం మానేశారు. అతని అవసరాలు వాళ్ళు చూడరు. వ్యవసాయంలో ఎంత వస్తున్నదీ కొడుకులు తండ్రికి చెప్పరు.

శివయ్యకు జీవితం దుర్భరమయింది. ఆయన ఇప్పుడు వీధి అరుగుమీద ఎంతో దిగులుగా కూర్చుని, ఎరిగినవారికి తన కష్టాలు చెప్పుకోసాగాడు.

శివయ్య స్నేహితుడైన పాపయ్య ఒక నాడు శివయ్య కథ అంతా విని, "నీ ఆస్తి కోసం నీ కొడుకులూ, కోడళ్ళూ నిన్ను ఎంతో శ్రద్ధగా చూశారు. నీ ఆస్తి అంతా వారికి పంచేసినాక వాళ్ళకు నీతో అవసరం తీరిపోయింది. నువు మళ్ళీ సుఖపడాలంటే ఒకటే మార్గం. నేను నీకు రేకుపెట్టెలో నూరురూపాయల చిల్లర ఇస్తాను. రాత్రివేళ నీ గదితలుపు మూసుకుని, ఆ చిల్లర అంతా కిందపోసి, ఒక్కొక్క నాణెమే పెద్దగా చప్పుడయేటట్టు రేకు పెట్టెలో, ఒక చేత్తో



వేసినది ఇంకో చేత్తో తీస్తూ ఒక గంటసేపు చప్పుడు చెయ్యి. ఏం జరుగుతుందో చూసుకో," అన్నాడు.

అటు తరవాత శివయ్య కోడళ్ళకు ప్రతి రాత్రీ ఎంతోసేపు శివయ్య గది నుంచి డబ్బుల మోతవినిపించేది. వాళ్ళు మొదట ఆశ్చర్యపోయారు. తరవాత వారికి మామ గారి మీద ఎక్కడలేని శ్రద్ధా, అనురాగమూ పుట్టుకొచ్చాయి.

మళ్ళా శివయ్యకు వెనకటిలాగే వేళకు ప్రతిదీ అమరుతున్నది. కొడుకులు శివయ్యతో వ్యవసాయానికి సంబంధించిన వివరాలన్నీ శ్రద్ధగా చెబుతున్నారు. శివయ్య జీవితం మళ్ళా సుఖంగా గడుస్తున్నది. తన ఎత్తు పారినందుకు శివయ్య స్నేహితుడు పాపయ్య చాలా సంతోషించాడు.

కొంతకాలం గడిచింది. శివయ్య కన్ను మూశాడు. చివరి ఘడియలలో పాపయ్య శివయ్యను చూడవచ్చాడు. శివయ్య ప్రాణంపోగానే ఆయన రేకుపెట్టె కోసం కొడుకులూ, కోడళ్ళూ ఆత్రపడుతూ ఉండటం చూసి పాపయ్య, "డబ్బు ఎక్కడికి పోతుంది? ముందు చచ్చిపోయిన వాడి దహనక్రియలు పూర్తిచేసి, తరవాత నలుగురి సమక్షంలోనూ పెట్టె తెరిచి, అందులో ఉన్నది ముగ్గురు అన్నదమ్ములూ సమంగా పంచుకోండి," అని శివయ్యకొడుకులతో అన్నాడు.

పాపయ్య మాట పాటించి శివయ్య కొడుకులు యథావిధిగా తండ్రికి ఉత్తర క్రియలు జరిపి, తరవాత పెద్దల సమక్షంలో రేకుపెట్టె తెరిచి చూశారు. దానిలో బోలెడంత చిల్లర మాత్రమే ఉన్నది. దానితో బాటు ఒక చీటీ కూడా ఉన్నది. అందులో ఇలా రాసి ఉన్నది:

" ఈ పెట్టెలో ఉన్న నూరు రూపాయల చిల్లర నా స్నేహితుడైన పాపయ్యది. అది ఆయనకే చెందాలి."

ఈ చీటీ చూసి శివయ్యకొడుకులూ, కోడళ్ళూ దిగ్భ్రమ చెందారు. పాపయ్య తన చిల్లర డబ్బులు తాను తీసుకుని వెళ్ళిపోయాడు.



# ఇద్దరు మూఢులు

ఒక ఊళ్ళో ఇద్దరు మూఢులు ఉండేవాళ్ళు. వాళ్ళు చిన్నతనం నుంచీ స్నేహితులు.

ఒక రోజు వాళ్ళిద్దరూ వీధిలో కలుసుకున్నారు. వారిలో ఒకడి చేతిలో సంచీ ఉన్నది. అందులో ఏవో వస్తువులున్నాయి.

"ఆ సంచిలో ఏమిట్రా?" అని రెండో మూఢుడు అడిగాడు.

మొదటివాడు 'తెలివిగా', "ఈ సంచీలో ఏ మున్నదీ చెప్పావంటే, ఇందులో ఉన్న గుడ్లు అన్నీ నీ కిచ్చేస్తాను," అన్నాడు.

రెండో మూఢుడు ఎంత ఆలోచించీ చెప్పలేకపోయాడు.

అప్పుడు మొదటి మూఢుడు, "కనుక్కోలేక పోయావే! ఇందులో గుడ్లున్నాయి. ఎన్ని గుడ్లున్నాయో చెప్పావంటే ఈ పది గుడ్లూ నీ కిచ్చేస్తాను," అన్నాడు.

రెండో మూఢుడు ఆలోచించాడు, కాని చెప్పలేకపోయాడు.

—వై. సత్యరాజు





# గర్వభంగం

పాండ్యరాజు సభలో విష్ణుశర్మ అనే పండితుడు ఉండేవాడు. ఆ పండితుడంటే రాజుకు ఎక్కువ లేని గౌరవం. రాజుగారి అండ చూసుకుని విష్ణుశర్మ ఆ రాజ్యంలోని మిగతా పండితులందరి వద్దా కప్పం వసూలు చేసేవాడు. ఎవరైనా ఆయనకు కప్పం కట్ట నిరాకరిస్తే వారు ఆయనతో శాస్త్ర వాదం చేసి ఓడించాలి. ఈ కారణంగా విష్ణుశర్మకు పండితకోలాహలుడు అన్న పేరు వచ్చింది. ఈ కోలాహలుడితో వేగలేక చాలామంది పండితులు ఆ రాజ్యం వదిలి, పొరుగు రాజ్యాలకు వలస వెళ్ళారు.

ఆ రాజ్యంలో మహాభాష్యభట్టు అనే పండితుడు ఉండేవాడు. ఆయన గొప్ప పండితుడే గాని పరమసాత్వికుడు. ఆయన కోలాహలుడితో గొడవ ఎందుకని, మిగిలిన పండితుల లాగే కోలాహలుడికి కప్పం చెల్లిస్తూ వచ్చాడు.

మహాభాష్యభట్టు వద్ద యామునుడు అనే ఒక వటువు శిష్యుడుగా ఉండేవాడు. ఈ యామునుడు గురువుగారి వద్ద సమస్త శాస్త్రాలూ చదివాడు. అతనిది మంచి చురుకైన బుద్ధి.

కోలాహలుడికి రెండు సంవత్సరాలు కప్పం కట్టక మహాభాష్యభట్టు బాకీ పడ్డాడు. ఆ బాకీ వసూలు చేసుకురమ్మని కోలాహలుడు వంజి అనే తన శిష్యుణ్ణి పంపాడు. వంజి నక్షత్రకుడి లాటివాడు.

వంజి మహాభాష్యభట్టు ఇంటికి వెళ్ళేసరికి ఆ పండితుడు పని మీద గ్రామాంతరం వెళ్ళి ఉన్నాడు. వంజి మహాభాష్యభట్టును గురించి వెటకారంగానూ, తేలికగానూ మాట్లాడుతూ, యామునుడితో కప్పం బాకీ గురించి చెప్పాడు.

తన గురువును గురించి వంజి అంత లోకువగా మాట్లాడటం యామునుడు

బి. శ్రీనివాసులురెడ్డి

సహించలేక, "మా గురువుగారు మీ గురువుకు అసలు కప్పం ఎందుకు కట్టాలి? పాండిత్యంలో మీ గురువుకు తీసిపోతాడా?" అని అడిగాడు.

"అయితే మీ గురువును మా గురువుతో శాస్త్రంలో పోటీ చేసి ఓడించమను. అప్పుడు రెండు సంవత్సరాల కప్పంబాకీ చెల్లుబడి పోతుంది," అన్నాడు వంజి.

"మీ గురువును ఓడించటానికి మా గురువుగారు ఇల్లు కదిలి అంతదూరం రావాలా? పద, నేనే వచ్చి ఓడిస్తాను. కప్పం కట్టే బాధ అందరికీ లేకుండా పోతుంది," అంటూ యామునుడు వంజి వెంట రాజసభకు బయలుదేరాడు.



యామునుడు ఎందుకు వచ్చాడో తెలుసుకున్న మీదట రాజసభలో వున్న వాళ్ళు, "ఈ పాటలు కొండను ఢీకొనబోతున్నదా?" అన్నారు.

రాణికి మాత్రం కోలాహలుడి మీద సదభిప్రాయం లేదు. ఆమె యామునుణ్ణి చూసి, "నిప్పురవ్వ లాగున్నాడు! గడ్డివామి ఎంత పెద్ద దయితేనేం? దాన్ని బూడిద చెయ్యటానికి ఒక నిప్పురవ్వ చాలును!" అనుకున్నది.

కోలాహలుడికీ, యామునుడికీ పోటీ ప్రారంభమయింది. కోలాహలుడు యామునుణ్ణి కొన్ని వ్యాకరణ సంబంధమైన ప్రశ్నలూ, తర్క సంబంధమైన ప్రశ్నలూ వేశాడు. వాటికి యామునుడు తేలికగా సమాధానాలు చెప్పాడు.

తరవాత కోలాహలుడు యామునుడితో, "నువు నీ యిష్టం వచ్చిన ప్రతిపాదన చెయ్యి. దాన్ని నేను ఖండిస్తాను. నేను ఖండించలేకపోతే నీవే ఖండించు. అప్పుడు విజయం నీది అవుతుంది," అన్నాడు.

యామునుడు నవ్వుతూ, "మీ అమ్మ గొడ్రాలు కాదు," అన్నాడు.

"అది నిర్వివాదం. ఎవరూ ఖండించలేరు," అన్నాడు కోలాహలుడు.

"పాండ్యరాజు ధర్మాత్ముడు," అన్నాడు యామునుడు.

"అదీ నిర్వివాదమే," అన్నాడు కోలాహలుడు.

"మహారాణి మహాపతివ్రత," అన్నాడు యామునుడు.

"దాన్ని కూడా ఎవరూ ఖండించలేరు," అన్నాడు కోలాహలుడు, ముఖం కందగడ్డలా చేసుకుని.

"మీరు ఓడారు. నేను ముందు చెప్పిన మూడు విషయాలనూ ఖండించగలను," అన్నాడు యామునుడు.

ఈ మాట విని సభికులందరూ నిర్ఘాంతపోయారు.

"మీరు మీ అమ్మకు ఒక్కడే కొడుకు. 'ఏక పుత్రో హ్యపుత్ర ఇతి లోకవాదాత్' అని మనుసంహితలో ఉన్నది. అందుచేత మీ తల్లికి ఒక కొడుకు ఉండి కూడా గొడ్రాలితో సమానమే.

"ఇక రాజుగారి సంగతి. 'సర్వతో ధర్మ షడ్భాగో, రాజ్ఞోభవతి రక్షతః; అధర్మా దపి షడ్భాగో, భవత్యస్యహ్య రక్షతః' అని కూడా మనుసంహితలో ఉన్నది. అంటే ప్రజలు చేసే పుణ్యపాపాలలో ఆరోవంతు రాజుకు సంక్రమిస్తుంది. ఈ కలికాలంలో రాజు ఎంత ధర్మాత్ముడైనా ప్రజలు అంతులేని పాపాలు చేస్తూ ఉంటారు. వాటిలో ఆరోవంతు రాజుకు చెందుతుంది. ఆ కారణంగా రాజు పూర్తిగా ధర్మాత్ముడు కాలేడు.

"ఇక రాణిగారి సంగతి. మనుసంహితలో రాజును గురించి ఇలా ఉన్నది. 'సో గ్నిర్భవతి, వాయుశ్చ, సోర్క్క, స్సోమ, స్సధర్మరాట్, స కుబేర, స్స వరుణః; స మహేంద్రః ప్రభావతః.' రాజులో ఇలా అగ్నీ, వాయువూ, సూర్యుడూ, చంద్రుడూ, యముడూ, కుబేరుడూ, వరుణుడూ, ఇంద్రుడూ అన్న ఎనిమిది మంది ఉండగా, ఆ ఎనిమిది మందికీ భార్య అయిన రాణిగారు పతివ్రత ఎలా అవుతుంది?" అన్నాడు యామునుడు.

రాజూ, సభికులూ యామునుడి చమత్కారాన్ని మెచ్చుకున్నారు. కోలాహలుడు ఓడిపోయి, తల వంచుకుని, సభ నుంచి వెళ్ళిపోయాడు.





# వెంటవచ్చినసొత్తు

ఒక ఊళ్ళో ఒక పిసినారి ముసలిది ఉండేది. దాని పిసినిగొట్టుతనం గురించి కథలు చెప్పుకునేవారు. పైకి చూస్తే దానికి గల ఆస్తి ఒక చిల్లులుపడ్డ చిన్నపాకా, దాని ముందు ఒకపక్క బాదంచెట్టూ, మరొకపక్క కరివేప చెట్టూనూ. ఊళ్ళో దాన్ని చూసి అసహ్యపడని వారులేరు. ఎవరూ దాని జోలికి పోయేవాళ్ళు కారు, అది ఎవరినీ దగ్గిరికి రానిచ్చేది కాదు.

ఎవరన్నా కరివేపాకు కావాలని వస్తే ముసలిది గుప్పెడు బియ్యం తీసుకుని రెండు రెమ్మలిచ్చేది. ఊళ్ళో పిల్లలు బాదం పళ్ళకోసం వస్తే కానీ తీసుకుని ఒక పండు ఇచ్చేది. దాని గుడిసె లోపల వంట కుండలూ, ఒక కుళ్ళుకంపు కొట్టె దిండూ, అంతకన్న కుళ్ళు గొంగళీ ఉండేవి.

ఆ ఊళ్ళోనే రంగడు అని పనిపాటలు లేని కుర్రాడు ఒకడు ఉండేవాడు. ముసలి దాన్ని ఆశ్రయిస్తే, అది ఎంతోకాలం బతకదు గనక, దాని ఆస్తి అంతా తనకే వస్తుందని వాడు ఆశపడ్డాడు.

రంగడు ఒకనాటి మధ్యాన్నంవేళ ముసలి దాని పాక దగ్గిరికి వచ్చాడు. ఆ సమయంలో ముసలిది బాదంచెట్టు కింద గొంగళి పరుచుకుని, తల కింద కుళ్ళు దిండుపెట్టు కుని పడుకుని, చెట్టు మీదికి ఉడతలు రాకుండా కాపలా కాస్తున్నది.

వాడు వసూనే, "అవ్వా, నీ చెట్టు బాదం పళ్ళు ఎలా ఉంటాయి?" అని ముసలి దాన్ని అడిగాడు.

ముసలిది రంగణ్ణి ఎగా దిగా చూసి, "ఎవరు తిని చూశారు? కావలిస్తే కాసీ ఇచ్చి పండుకొని తిని చూడు," అన్నది.

ఈ మాటకు రంగడు నవ్వుకుని, "అవ్వా, నువ్వు ఒక్కదానివి పని అంతా ఎలా చేసు కుంటున్నావు? సాయంగా ఉంటాను,

ఎం. కామేశ్వరరావు



నన్ను నీ దగ్గిర ఉంచుకోరాదూ?" అని అడిగాడు.

"ఎందుకు, తిండి దండగ?" అన్నది ముసలిది.

"దండగ లేదు, అవ్వా. రెండు రోజులుంచుకుని చూడు. దండగ అని తోస్తే పని మానిపించెయ్యి. నీ కరివేపాకూ, బాదం పళ్ళూ నాలుగు వీధులూ తిరిగి అమ్ముకొస్తా. నాలుగు డబ్బులు ఎక్కువ వస్తాయి. నీ పనులన్నిటిలోనూ ఆసరాగా వుంటా," అన్నాడు రంగడు.

ముసలిది కాస్త ఆలోచించి, "సరే, బాదంపళ్ళను ఉడతలు కొట్టకుండా చూస్తూ ఉండు. నాకు తృప్తి కలిగితే నిన్ను పనిలో ఉంచుకుంటా," అని, దిండూ, గొంగళీ తీసుకుని గుడిసెలోకి వెళ్ళిపోయింది.

రంగడికి ముసలిది తిండి పెడుతున్నందుకు వాడిచేత గొడ్డుచాకిరీ చేయించింది. అమ్మకానికి కరివేపాకు రెమ్మలు కూడా లెక్క పెట్టి ఇచ్చేది. ఒక్క కానీ తక్కువ వచ్చినా ఊరుకునేది కాదు. వాడు బాదం పండు తినాలన్నా కానీ యిచ్చి కొనుక్కోవలిసిందే! రంగడు ఇవన్నీ భరించి ముసలిదాని చావుకోసం ఎదురు చూస్తున్నాడు.

కొంతకాలం గడిచాక ముసలిదాని శక్తి పూర్తిగా ఉడిగిపోయింది. అది తనకు రోజులు దగ్గిర పడుతున్నాయని గ్రహించింది. తన పాక ఊరికే పోవటం దేనికని తనకు తెలిసిన శెట్టి దగ్గిర ఆ పాక తాకట్టు పెట్టి ఆమె డబ్బు తెచ్చుకున్నది.

ముసలిది ఇంటికి వెళ్ళిపోయిన కాస్సేపటికి రంగడు కరివేపాకు అమ్ముతూ శెట్టిగారి ఇంటి పక్కగా వచ్చాడు. శెట్టి వాణ్ణి చూసి, "ముసలిముండ పాక తాకట్టు పెట్టి రెండు వందలు తీసుకువెళ్ళింది. అందులో నీ వాటా ఎంతరా?" అని వెకిలిగా నవ్వుతూ అడిగాడు.

"ముసలిది ఇల్లు కూడా సొమ్ము చేసిందన్నమాట. అయినా ఆ డబ్బు ఎక్కడికి పోతుందిలే?" అని మనసులో అనుకుంటూ రంగడు వెళ్ళిపోయాడు.

రాత్రి పూట ముసలిది పాకలో పడుకుంటుంది. రంగడు బాదంచెట్టు కింద పడుకుంటాడు. ఒక రాత్రి వేళ పాకలో అలికిడి విని రంగడు తలుపు కంతలో నుంచి లోపలికి చూశాడు. లోపల ముసలిది, శెట్టి దగ్గిర తెచ్చిన రూపాయలు దీపం ముందు లెక్క పెట్టుకుంటున్నది.

"నువు చావగానే అదంతా నాకు దక్కేదెనె, ముసలిదానా!" అనుకుని రంగడు తిరిగి వెళ్ళి బాదంచెట్టు కింద పడుకున్నాడు. ఇలా దాచిన డబ్బు ముసలిదాని దగ్గిర ఇంకా చాలా ఉన్నదని వాడి నమ్మకం.

రోజులు గడుస్తున్నాయి. ఒక రోజు ముసలిది లేవ లేదు. దాని కేదో జబ్బు చేసింది. గొంగళి పరుచుకుని పడుకుని, ఊపిరి పీల్చటానికి కూడా కష్టపడుతున్నది. తనకు చావు దగ్గిర పడిందని గ్రహించి, ఆమె రంగడితో, "నాయనా, నాకు చావు ముంచు కొస్తున్నది. పద, పోయి వల్లకాట్లో కూర్చుందాం. ఇక్కడే చచ్చానంటే, మోసే వాళ్ళు చాలా డబ్బు అడుగుతారు," అంటూ లేచి కూర్చున్నది.

రంగడు చిరాకుపడి, "వల్లకాటికి పోయినంత మాత్రాన ఖర్చు తప్పుతుందా? కట్టెలూ, మనుషులూ కావద్దా?" అన్నాడు.

"కాల్చటం దేనికిరా? డబ్బు దండుగ. పూడ్చేస్తేపోలా? గొయ్యి తవ్వటానికి కూడా బోలెడు డబ్బు అడుగుతారు. ఆ గొయ్యి నువ్వే తవ్వు. నేను చెట్టు కింద పడుకుంటా. నా ప్రాణం గుటుక్కు మనగానే



నన్ను గోతిలో పూడ్చి పెట్టు." అన్నది ముసలిది.

ముసలిద్ది ఆదా చేసిందంతా తనకే లాభ మనుకున్నాడు రంగడు. రంగడి సహాయంతో ముసలిది గొంగళీ, దిండూ తీసుకుని బయలు దేరింది. రంగడు గునపం తీసుకున్నాడు. ఇద్దరూ శ్మశానానికి చేరారు. ముసలిది ఒక చింతచెట్టు కింద దిండు మీద తలపెట్టి పడు కుని, గొంగళి కప్పుకున్నది.

రంగడు గుంట తవ్వ నారంభించాడు. మధ్యలో ముసలిది, "గొయ్యి తవ్వటం అయిందా, నాయనా?" అని అడిగింది.

"అవగానే నీకు చెబుతాలే, అవ్వా! నువు పడుకో," అన్నాడు రంగడు.

రంగడు గొయ్యి తవ్వటం పూర్తి చేసే సరికి అఖరి ఝాము అయింది.

"అవ్వా, గొయ్యి తయారయింది, చూడు," అన్నాడు రంగడు. ముసలిది పలక లేదు. దాని ప్రాణంపోయి చాలాసేపయింది.

"పీడ విరగడ అయింది. పాకలో డబ్బంతా నాదే!" అని సంతోషించి రంగడు, ముసలి దాని కుళ్ళుదిండూ, కుళ్ళుగొంగళీ చేత్తో తాకటానికి అసహ్యం వేసి, వాటిని కర్రతో గోతిలోకి తోసి, తరవాత ముసలి దాన్ని గోతిలో పడుకోబెట్టి, మన్ను కప్పి, గబగబా పాకకు తిరిగి వచ్చాడు.

వాడు లాంతరు వెలిగించి పాక అంతా వెతికాడు. నేల అంతా తవ్వాడు. ఎక్కడా చిల్లిగవ్వలేదు. పాక మీది ఆకులు పీకి చూశాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. ముసలిది పాక తాకట్టు పెట్టిన రాత్రి ఆ డబ్బు కాజేసినా బాగుండేది. ఆ డబ్బు కూడా మాయమయింది. తాను ఏ జన్మ లోనో ముసలిదానికి ఋణపడి ఉండి, దానికి చాకిరీ చేశాడు. తన కింకేమీ దక్క లేదు. ముసలిది తన డబ్బంతా ఆ కుళ్ళు దిండులో పెట్టుకుని తన వెంట తీసుకు పోయిందన్న సంగతి రంగడికి తట్టలేదు.

తెల్లవార వస్తున్నది. పాక అంతా ధ్వంసం చేసినందుకు తనకు శిక్ష జరుగుతుందని తెలిసి రంగడు చీకటిలోనే ఆ వూరు విడిచి పారిపోయాడు.





# మహాభారతం

## 46. కర్ణుడి శపథం

సంజయుడు పాండవులతో తన రాయబారం ముగించుకుని హస్తినాపురానికి తిరిగి వచ్చి, ధృతరాష్ట్రుడి దర్శనం చేసుకుని, "రాజా, ధర్మరాజు అధర్మమంతా నీ పైనే ఆరోపించాడు. నువు లోకనిందకు లోనయావు. ధర్మరాజు పంపిన సందేశాన్ని రేపు సభలో అందరూ ఉండగా చెబుతాను." అని, ధృతరాష్ట్రుడి అనుమతితో ఇంటికి వెళ్ళిపోయాడు.

సంజయుడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కార్యాలోచనకు పిలిపించాడు. విదురుడు రాగానే ఆయన, "పాండవుల వద్దనుంచి సంజయుడు వచ్చి వెళ్ళాడు. నాకు నిద్ర రాకుండా వున్నది. మనస్సులో తాపంగా ఉన్నది. నా తాపం పోగొట్టే మాటలు చెప్పు." అన్నాడు.

ధృతరాష్ట్రుడికి నిద్ర రాకపోవటానికి కారణం పాండవులే అని తెలుసుకుని విదురుడు ఆయనను పెట్టవలసిన చివాట్లన్నీ పెట్టి, "రాజా, నువు భూమి కోసం అబద్ధం ఆడక, వంశక్షయం కలగకుండా చూసుకో. దుర్యోధనుడి కోసం పాండవులను దూరం చేసుకున్నావు. ఇందుకు దుర్యోధనుడు భ్రష్టుడైపోవటం చూస్తావు. పాండవులను చేరదీసి, వాళ్ళు బతకటానికి కొన్ని గ్రామాలైనా ఇయ్యి. నీ కొడుకులను అదుపులో ఉంచుకో. జ్ఞాతివైరం తగదు. ఆపదలో ఆదుకునేది వాళ్ళే." అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "నేను ఎప్పుడూ పాండవులను గురించి మంచిగానే ఆలోచిస్తాను. కాని దుర్యోధనుడు జ్ఞాపకం



రాగానే నా బుద్ధి మారిపోతుంది. ఇదంతా దైవయోగం. నేను ఏం చెయ్యగలను?'' అన్నాడు.

మర్నాడు ఉదయం ధృతరాష్ట్రుడి సభ కిటకిటలాడు తున్నది. దుర్యోధనుడికి యుద్ధంలో సహాయం చేయటానికి వచ్చిన రాజులందరూ, సంజయుడు పాండవుల నుంచి తెచ్చిన సందేశం వినటానికి కుతూహలపడి సభకు వచ్చారు.

ఆ సభలోకి సంజయుడు ప్రవేశించి, అందరికీ నమస్కారాలు చేసి, ''రాజన్యులారా, నేను పాండవుల దగ్గిరికి వెళ్ళి వచ్చాను. వారు మిమ్మల్నందరినీ అడిగినట్టు చెప్పమన్నారు. వారంతా క్షేమంగా ఉన్నారు. వారికి నేను ధృతరాష్ట్ర మహారాజు చెప్పమన్న మాటలు చెప్పాను,'' అన్నాడు.

అతనితో ధృతరాష్ట్రుడు, ''సంజయా, నువు వెళ్ళి పాండవులకు నా సందేశం తెలిపినందుకు చాలా సంతోషం. మిగిలిన వాళ్ళు ఏమన్నదీ తరవాత వింటాంగాని, ముందు అర్జునుడు ఏమన్నాడో చెప్పు. ఈ రాజులందరూ వింటారు,'' అన్నాడు.

సంజయుడు ఇలా చెప్పాడు:

''అందరూ వింటూండగా అర్జునుడు ఇలా చెప్పమన్నాడు: దుర్యోధనుడు మొదలైన వాళ్ళు చాలా పాపాలు చేశారుగాని వాటికి ప్రాయశ్చిత్తం అనుభవించలేదు. యుద్ధం తలపెడితే పాపఫలం అనుభవిస్తారు. ధర్మరాజు ఎంతో క్రోధాన్ని అణచుకున్నాడు; అది బయటికి వస్తే కౌరవులు భస్మమైపోతారు. భీముడు ఒక్క గద మాత్రమే తీసుకుని కౌరవసేనలను నిర్మూలించేటప్పుడు దుర్యోధనుడు తప్పక పశ్చాత్తాప పడతాడు. నకుల సహదేవులూ, విరాట ద్రుపదులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, నేనూ విజృంభించి పోరాడుతూ ఉంటే దుర్యోధనుడికి పశ్చాత్తాపం తప్ప ఇంకేమీ మిగలదు. నేను పెద్దలందరికీ నమస్కరించి మా రాజ్యం కోసం మాత్రమే యుద్ధం చేస్తాను. పాండవులు ప్రాణాలతో

ఉండగా ధృతరాష్ట్రుడి కొడుకులు మా రాజ్యాన్ని సుఖంగా ఎలా అనుభవించ గలరు? ఒకవేళ యుద్ధంలో వారు మమ్మల్ని జయించగలిగితే లోకంలో ధర్మం నశించి నట్టే. అలా జరగదు. యుద్ధం తప్పనిసరి అయితే ధృతరాష్ట్రుడి వంశం నిర్మూలమవు తుంది. కర్ణుడితో సహా ధృతరాష్ట్రుడి కొడు కులనందరినీ నేనే చంపుతాను. అందుచేత ఏం చేస్తారో తేల్చుకోండి."



అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నువు కర్ణుడి మాటలూ, శకుని మాటలూ, దుశ్శాసనుడి మాటలూ విని చెడిపోతున్నావు. కౌరవ పాండవ యుద్ధం నివారించు. లేక పోతే నాశనం తప్పదు," అన్నాడు.

ఈ మాటకు కర్ణుడు ఆగ్రహించి, "భీష్మా, నన్ను గురించి నువు అన్నమాట మరొకడు అంటే బతికి ఉండేవాడు కాదు. నేను రాజధర్మాన్ని ఏమాత్రమూ తప్ప లేదు. దుర్యోధనాదులకు ఎన్నడూ, ఎలాటి ద్రోహమూ చెయ్యలేదు. యుద్ధంలో నేనొక్కణ్ణే పాండవులందరినీ జయించ గలను. మొదటి నుంచీ శత్రువులుగా ఉన్న వాళ్ళతో శాంతి ఏమిటి? ధృతరాష్ట్ర మహా రాజుకూ, దుర్యోధనుడికీ ఇష్టమైనదంతా నేను చేస్తాను," అన్నాడు.

అప్పుడు భీష్ముడు ధృతరాష్ట్రుడితో, "ఈ కర్ణుడు పాండవులను చంపగలనని మాటిమాటికీ పేలుతూ ఉంటాడు. పాండ వులు చేసిన ఘన కార్యాలలో ఒక్కటి కూడా ఇతను చెయ్యలేదు. హీనుడూ, దుర్బుద్ధీ అయిన ఇతను పాండవులను గురించి అవమానకరంగా మాట్లాడతాడు. గోగ్రహణమప్పుడు తన తమ్ముణ్ణి అర్జునుడు చంపితే ఏం చేశాడు? ఘోషయాత్ర సమ యంలో గంధర్వులు దుర్యోధనుణ్ణి పట్టుకు పోతే ఏం చేశాడు? పాండవులేగదా అతన్ని విడిపించింది? కర్ణుడు మాటలవాడేగాని చేతలవాడు కాదు. ఇతని మాటలు పాటించ వద్దు," అన్నాడు.

ద్రోణుడు మాట్లాడుతూ, "భీష్ముడిచ్చిన సలహా బాగుంది. అర్జునుడు సంజయుడి



ద్వారా పంపిన సందేశంలో అబద్ధం ఏమీ లేదు. పాండవులతో సంధి చేసుకోమని నేను ఎప్పుడూ చెబుతూనే వున్నానుగదా." అన్నాడు.

భీష్మద్రోణులు చెప్పిన మాటలకు ధృతరాష్ట్రుడు ఏమీ అనక, ధర్మరాజు ఏమన్నాడని సంజయుణ్ణి అడిగాడు. ధర్మరాజుకు ఎవరెవరు యుద్ధంలో సహాయపడుతున్నారో సంజయుడు వివరించి చెప్పి, ధర్మరాజు యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడని చెప్పాడు.

కాని ధృతరాష్ట్రుడికి భీముణ్ణి తలుచుకుంటేనే వణుకు పుట్టుతుంది. సంజయుడు చెప్పిన యోధులంతా ఒక ఎత్తూ, భీముడు ఒక ఎత్తూ అని ఆయన నమ్మకం. భీముడి బలం ఎలాటిదో భీష్మ ద్రోణ కృపులకూ తనకూ మాత్రమే తెలుసు. భీష్మ ద్రోణ కృపులు యుద్ధంలో తప్పనిసరిగా తమ పక్షాన పోరాడుతారు గాని, వారికి పాండవుల పట్ల వైరం లేదు. ఇవన్నీ తలచుకుంటే ధృతరాష్ట్రుడికి కౌరవనాశం కళ్ళ ఎదట కనపడ్డట్టయింది. అర్జునుడు ఎన్నడూ యుద్ధంలో ఓడి ఎరగడు. అతన్ని ఎదిరించే వాళ్ళు ఎవరున్నారు? కర్ణుణ్ణి నమ్మటానికి లేదు. ద్రోణుడు వయసు మళ్ళినవాడు; పైపెచ్చు అర్జునుడికి గురువు.

"యుద్ధం వల్ల కౌరవ వంశనాశనం తప్పదు. యుద్ధం చెయ్యకుండా ఉంటేనే అందరికీ క్షేమమని తోస్తున్నది. అందరూ ఒప్పుకుంటే శాంతి కోసం ప్రయత్నించుదాం," అన్నాడాయన.

ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, అన్ని చిక్కులకూ మూల కారణం నువే. కురుజాంగల భూములు తప్ప మిగిలినదంతా పాండవులు నీకు జయించి ఇచ్చిన రాజ్యమే కద. అదంతా నీ సొంతం చేసుకున్నావు. అదంతా నీ దేనన్న ధోరణిలో ఉన్నావు. నీ కింద ఉండిన రాజులు అనేకులు పాండవుల శక్తి గ్రహించి వారి పక్షం అయారు. దుర్యోధనుణ్ణి అదుపులో ఉంచక పోతే చాలా ప్రమాదం ఉన్నది." అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు తండ్రితో, "మేము ఓడిపోతామని నీకు భయం దేనికి? మేము తప్పక గెలుస్తాము. నిన్నూ, విదురుణ్ణీ తప్ప మిగిలిన మన అందరినీ చంపించాలని కృష్ణుడి ఉద్దేశం. పాండవులు నిజంగా యుద్ధంలో గెలవగలిగితే అయిదు ఊళ్ళు ఎందుకు అడుగుతున్నారు? భీముణ్ణి చూసి నీ కెందుకు భయం? నా గదతో ఒక్క దెబ్బ కొట్టి భీముణ్ణి చంపగలను. భీష్ముడు ఒక్కడే పాండవసేనలను నాశనం చెయ్యగలడు. ఆయనతోబాటు ద్రోణుడూ, అశ్వత్థామా కలిసి అర్జునుణ్ణి చంపలేరా? కర్ణుడి వద్ద ఇంద్రుడిచ్చిన శక్తి ఉన్నది. పాండవసేనలో నిజమైన యోధులు పాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ మాత్రమే. మన పక్షాన అలాటి యోధులు ఎందరో ఉన్నారు," అన్నాడు.

తరవాత అతను సంజయుణ్ణి, "పాండవుల యుద్ధతంత్రం ఏమిటి?" అని అడిగాడు. కౌరవసేనలలో ఏయే సేనలనూ, యోధులనూ పాండవపక్ష యోధులు తమ వంతుగా ఏర్పాటు చేసుకున్నదీ సంజయుడు వివరంగా చెప్పాడు.

ఆ వివరాలు విని ధృతరాష్ట్రుడు బెంబేలు పడి దుర్యోధనుడితో, "నాయనా, యుద్ధం ఆలోచన కట్టిపెట్టు. నిన్ను అందరూ మెచ్చుకుంటారు. నువు సుఖంగా బతకటానికి సగం రాజ్యం చాలు. పాండవులకు కొంత రాజ్యం ఇయ్యి. అజ్ఞానంచేత నాశనం తెచ్చిపెట్టుకోకు," అన్నాడు.





"నేను ఎవరి మాటలూ విననవసరం లేదు. పాండవులను జయించటానికి నాకు ఎవరి సహాయమూ అవసరంలేదు. కర్ణుడూ, దుశ్శాసనుడూ ఉంటే చాలు. పాండవులను మేము ముగ్గురమే చంపగలం. వాళ్ళూ మేమూ కూడా బతికి ఉండటానికి వీల్లేదు. నేను సూది మొన మోపినంత భూమి కూడా పాండవులకు ఇయ్యను," అని దుర్యోధనుడు అన్నాడు.

కర్ణుడు దుర్యోధనుణ్ణి సమర్థించి, యుద్ధ భారమంతా తాను ఒక్కడే వహిస్తాననీ, పాండవులను తానే జయిస్తాననీ అన్నాడు.

అతని మాటలు వింటుంటే భీష్ముడికి అసహ్యం వేసింది.

"కర్ణా, నీ బుద్ధి వికటించి ఇలా మాట్లాడుతున్నావు. అర్జునుడి పరాక్రమమూ, కృష్ణుడి శక్తీ తెలిసి కూడా ఎందుకిలా ప్రగల్భాలు పలుకుతున్నావు? ఇది నీచుడి లక్షణం కాదా?" అన్నాడు.

ఈ మాట కర్ణుడికి అవమానకరమయింది. అతను భీష్ముడితో, "కృష్ణుడు నువు చెప్పినంత గొప్పవాడే, కాని నన్ను తూలనాడటం సహించను. నేను అస్త్రసన్యాసం చేస్తున్నాను. నువు యుద్ధరంగంలో నిలిచి ఉన్నంత కాలమూ అందులోకి అడుగు పెట్టను. నీ అనంతరం నా పరాక్రమాన్ని మిగిలిన వాళ్ళు చూస్తారు," అని సభ నుంచి వెళ్ళిపోయాడు.

భీష్ముడు వెటకారంగా నవ్వుతూ దుర్యోధనుడితో, "ఒంటరిగా శత్రువును గెలవ గల మహా పరాక్రముడు అస్త్రసన్యాసం చేశాడే, యుద్ధభారం ఇప్పుడెవరు వహిస్తారు? వీడు తానొక్కడే శత్రువులను జయిస్తానంటే ఎవరు నమ్ముతారు? కాకపోయినా, జయద్రథుడూ, బాహ్లికుడూ లాటి మహాయోధుల ముందు అలా ప్రగల్భాలు పలకటం తప్పు కాదా? బ్రాహ్మడినని చెప్పి వీడు పరశురాముడి వద్ద అస్త్రాలు సంపాదించి అధర్మానికి పాల్పడ్డాడు," అన్నాడు.

భీష్ముడిలా అన్నందుకు దుర్యోధనుడు ఆయనను నిందిస్తూ; "తాతా, పాండవులు

కూడా మాలాటి వాళ్ళే, మాతోపాటు పుట్టిన వాళ్ళే. మాకు కూడా అస్త్రవిద్యలూ, యుద్ధ విద్యలూ తెలుసు. అలాటప్పుడు పాండవులే గెలుస్తారని ఎలా చెప్పావు? నేను యుద్ధంలో మీ ఎవ్వరిమీదా ఆధారపడబోవటంలేదు,'' అన్నాడు.

దుర్యోధనుడి యుద్ధ కాంక్ష చూసి విదురుడు అతనికి ఒక కథ చెప్పాడు: ఒక బోయవాడు వలపన్నితే అందులో రెండు పక్షులు తగులుకున్నాయట. అయితే అవి భయపడక, వలతోపాటు జంటగా ఆకాశంలో ఎగిరిపోసాగాయి. వాటిని వెంబడిస్తూ బోయవాడు నేల మీద పరిగెత్తనారంభించాడు. అది చూసి ఒక ముని, ''వెర్రివాడా, ఆకాశంలో ఎగిరి పోయే పక్షులను నేలమీద వెంబడించి ఏమైనా ప్రయోజనం ఉందా?'' అని అడిగాడు. దానికా బోయవాడు, ''స్వామీ, ఆ పక్షులు రెండూ తమలో తాము పోట్లాడుకోనంత కాలమూ నా ప్రయత్నం వ్యర్థమే. కాని అవి పోట్లాటకు దిగగానే ఆ పక్షులూ, వాటిని కలిపి ఉన్న నా వలా కూడా నాకు దక్కుతాయి,'' అన్నాడు. చివరకు అలాగే జరిగింది. పక్షులు కీచులాడుకుని కింద పడ్డాయి. బోయవాడు రెంటినీ పట్టుకుని, తన వల తాను తీసుకున్నాడు.

విదురుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, ''నాయనా, జ్ఞాతులు ఆస్తికోసం కలహించటం వల్ల సర్వనాశనం కలుగుతుంది. ఇంకొక సంఘటన చెబుతాను. మేము ఒకసారి కిరాతుల వెంట గంధమాదన పర్వతానికి వెళ్ళాం. అక్కడ భయంకరమైన లోయలో ఒక పెద్ద తేనెపట్టున్నది. ఆ తేనె తాగితే జరామరణాలుండవనీ, గుడ్డివాళ్ళకు కళ్ళు వస్తాయనీ అక్కడి వాళ్ళు చెప్పారు. మా వెంట వచ్చిన కిరాతులు ఆ తేనె కోసం ఆశపడి, క్రూరసర్పాలు తిరిగే ఆ లోయలోకి దిగి చచ్చిపోయారు. వాళ్ళు తేనె కోసం ఆశపడ్డారేగాని, దాన్ని సాధించటంలో గల ప్రమాదం ఆలోచించలేదు. రేపు రాజ్యం కోసం పాండవులతో యుద్ధం చెయ్యటం కూడా ఇలాటి అవివేకమే అవుతుంది,'' అన్నాడు.






## 1

మృకండుమహర్షి భృగు సంతతివాడు. అతని భార్య మరుద్వతి. వారికి ఎన్నాళ్ళకూ సంతానం కలగకపోగా నిష్ఠానియమాలతో తపస్సులు చేస్తూ క్షేత్రాలు సేవించుకుంటూ కేదారక్షేత్రానికి వచ్చారు.

ఒకనాడు కేదారేశ్వరుణ్ణి అర్చించి ధ్యానమగ్నులై ఉండగా, "ఇహ మీరు మీ ఆశ్రమానికి వెళ్ళండి, మీకు పుత్రభాగ్యం కలుగుతుంది!" అని వారికి వినిపించింది. సంతోషంతో వారు ఇంటికి వచ్చి యథావిధిగా గృహస్థాశ్రమ ధర్మాల్ని నిర్వర్తించుతూండగా కొన్నాళ్ళకు మరుద్వతి మగ శిశువును ప్రసవించింది. అదే సమయంలో ఆకాశం నుండి వారికి, "ఈ పిల్లవాడు అల్పాయుష్కుడు - పన్నెండేళ్ళ ఆయువు!" అని ఒక దివ్యవాణి వినిపించింది. అది విని వారు ఆనంద శిఖరాగ్రం నుండి ఒక్కసారిగా దుఃఖసాగరపు లోతుల్లోకి కూలిపోయారు. చివరకు, "అంతా ఆ శివునిలీల, మనం ఏం చేయగలం?" అని తెప్పరిల్లి పసివాడిబోసి నవ్వుల్లో మైమరిచారు.

తరువాత మృకండుడు కుమారుడికి జాతకర్మ జరిపించి మార్కండేయుడు అని నామకరణం చేశాడు. దినదిన ప్రవర్ధమానుడై మార్కండేయుడు ఉపనయనం అయ్యాక గురుకులానికి వెళ్ళి గురువుల వద్ద విద్యాబుద్ధులన్నీ నేర్చి పదకొండేళ్ళవాడై తలిదండ్రుల వద్దకు వచ్చాడు. బ్రహ్మతేజంతో ముద్దులుమూటగట్టుతున్న కుమారుణ్ణి చూడగానే వారి గుండెలు తరుక్కుపోయినవి. ఇంకొక్క సంవత్సరమే గడువు! మరుద్వతి కుమారుణ్ణి వదలకుండా కౌగలించుకొని కన్నీరు కార్చుతుండేగాని మార్కండేయుడు ఎంత తరిచి తరిచి అడి

అట్ట చివరి బొమ్మ

గినా అసలు సంగతి చెప్పదు. చివరకు మృకండుడే చెప్పలేక చెప్పలేక కొడుకుతో అతనికి ఒక యేడాదిలో మృత్యువు ఆసన్నం అవుతూన్నదని విషయమంతా చెప్పాడు.

అది విని మార్కండేయుడు ధీర చిత్తంతో కర్తవ్యాన్ని ఆలోచించి, "మీరు నన్ను ఆశీర్వదించండి, ఇప్పుడే నేను తపస్సుకి వెళుతున్నాను. శివానుగ్రహంతో మృత్యువును జయించి చిరంజీవినై వస్తాను." అని తలిదండ్రులకు ప్రణమిల్లాడు. మరుద్వతీ మృకండులిద్దరూ కుమారుణ్ణి కౌగలించుకొని 'చిరంజీవ' అని దీవించారు. అదే సమయానికి అక్కడికి నారదమహర్షి వచ్చాడు. మృకండుడు నారదుణ్ణి పూజించి తమ కుమారుడి గురించి అంతా చెప్పాడు.

నారదుడు మార్కండేయుడి దృఢసంకల్పాన్ని మెచ్చుకున్నాడు. "నాయనా! మార్కండేయా! నువ్వు తిన్నగా గౌతమీ తీరానికి వెళ్ళు. అక్కడ పంచాక్షరీ మంత్రంతో శివుణ్ణి దీక్షతో అర్చించు, నీకు జయమౌతుంది!" అని దీవించి వెళ్ళాడు.

మార్కండేయుడు గౌతమీతీరాన్ని చేరుకొని సైకతలింగాన్ని ప్రతిష్ఠించి, "చంద్రశేఖరా! నీవే నన్ను రక్షించు! నీ పాదాలను ఆశ్రయించిన నన్ను యముడు ఏం చేయగలడు?" అంటూ దీక్షతో తపస్సు సాగించాడు.

లోకాలన్నీ తిరుగుతూ నారదుడు యముడి దగ్గిరికి పోయి, "మృత్యువును తప్పించుకోడానికి మార్కండేయుడనే ముని



బాలకుడు తపస్సు చేస్తున్నాడు. ఇహ నీ బలాబలా లెలాంటివో తేలే సమయం వచ్చింది!'' అంటూ చల్లగా చెప్పిపోయాడు.

మార్కండేయుడి ఆయువు పూర్తికా వస్తున్నది. యముడు మార్కండేయుడి ప్రాణాలు తోడితెమ్మని తన దూతలను పంపాడు. యమకింకరులు మార్కండేయుణ్ణి సమీపించలేక తిరిగి వచ్చారు. అప్పుడు యముడే దండాన్నీ, పాశాన్నీ ధరించి శారుఎనుబోతు నెక్కి బయల్దేరాడు.

మార్కండేయుడు శివలింగానికి తలను ఆనించి రెండు చేతులతోనూ శివలింగాన్ని గట్టిగా బిగించి పట్టుకొని ధ్యానమగ్నుడై ఉన్న సమయంలో యముడు కాలపాశాన్ని మార్కండేయుడి కంఠానికి విశిరాడు. ఆ పాశం శివలింగం మీదుగా పడిపడ్డంతో శివలింగం నుండి శివుడు ప్రళయరుద్రుడై తెరుచుకొన్న త్రినేత్రంతో ఆవిర్భవించి యముడిపై త్రిశూలాన్ని గురి పెట్టేసరికే యముడు భయంతో గజగజలాడిపోతూ చేతులెత్తి జోడిస్తూ, ''హరహరా! రక్షించు!'' అంటూ కూలిపోయాడు.

శివుడు మార్కండేయుడి తలపై తన అభయహస్తాన్ని ఉంచి, ''వత్సా! నీకు మృత్యువు లేదు. కల్ప కల్పాంతరాలు చూస్తూ చిరంజీవిగా ఉంటావు!'' అని వరమిచ్చాడు. తరువాత దేవతలంతా వచ్చి యముడు లేకపోతే చాలా యిబ్బందులు వచ్చి పడతాయి గనక యముణ్ణి మన్నించమని శివుణ్ణి కోరారు. శివుడి అనుగ్రహంతో



యముడు మళ్ళీ పునర్జన్మ ఎత్తినట్టుగా లేచి తన లోకానికి వెళ్ళాడు.

ఆ సమయానికే కుమారుణ్ణి వెతుక్కుంటూ వచ్చిన మరుద్వతీ మృకండులు శివానుగ్రహం పొందిన మార్కండేయుణ్ణి చూసి శివలీలలను కొనియాడుతూ చిరంజీవితో తమ నివాసానికి వెళ్ళారు.

మార్కండేయుడు బహుకాలం జీవించినవాడు కాని అతని కన్న ఎక్కువ కాలం జీవించిన వాళ్ళున్నారు.

ఇంద్రద్యుమ్నుడు అనే రాజు బతికి ఉండగా గొప్ప యశస్సు సంపాదించి, అది నిలిచినంత కాలమూ స్వర్గసుఖాలు అనుభవించాడు. తరవాత స్వర్గంలో వాళ్ళు, "భూలోకంలో నిన్ను తలుచుకునే వాళ్ళెవరూ లేరు. అందుచేత నీకు స్వర్గంలో స్థానం లేదు. భూమికి తిరిగి వెళ్ళు," అన్నారు.

ఇంద్రద్యుమ్నుడు భూలోకానికి తిరిగి వచ్చి, తన పేరు విన్నవారి కోసం వెతుకుతూ మార్కండేయుడి వద్దకు వచ్చాడు.

"నేను నిన్ను ఎరగను. కాని నా కంటె పెద్దవాడు ప్రావారకర్ణుడు అనేవాడు (గుడ్లగూబ) ఉన్నాడు. వాణ్ణి అడుగు," అన్నాడు మార్కండేయుడు. ఇద్దరూ కలిసి ప్రావారకర్ణుడి వద్దకు వెళ్ళారు..

"నేను నిన్ను ఎరగను కాని నా కన్న పెద్దవాడు నాళీకజంఘుడున్నాడు. అతన్ని అడుగుదాం," అన్నాడు ప్రావారకర్ణుడు.

నాళీకజంఘుడు కూడా ఇంద్రద్యుమ్నుణ్ణి ఎరగడు. అతను వారిని వెంటబెట్టుకుని తన కన్న వయసుగల అకూపారుడు అనే తాబేలు వద్దకు వెళ్ళాడు.

అకూపారుడు ఇంద్రద్యుమ్నుణ్ణి చూసి, "నేను నిన్ను ఎరుగుదును. నేనుంటున్న ఈ కొలను ఎలా వచ్చింది? నువు అనేక యజ్ఞాలు చేసి గోవులను దానమియ్యగా, ఆ గోవులు తొక్కటం చేత ఏర్పడింది," అన్నాడు.

అప్పుడు దేవదూతలు, ఇంద్రద్యుమ్నుడి కీర్తి ఇంకా భూలోకంలో మిగిలి ఉన్నదని చెప్పి, అతన్ని స్వర్గానికి తీసుకుపోయారు.



# 133. "అల్బట్రాస్" పక్షి

దక్షిణ అమెరికా దక్షిణపు కొనకు 1200 మైళ్ళు తూర్పున, దక్షిణ అట్లాంటిక్ అతి శీతల ప్రాంతంలో దక్షిణ జార్జియా దీవి వెంబడి అల్బట్రాస్‌దీవి అనే చిన్న లంక ఉన్నది. దాని మీద అల్బట్రాస్ అనే అపూర్వమైన పక్షులు నివసిస్తాయి. ఇవి జలచరాలు. చాలా భారీ అయిన పక్షులు. వాటి రెక్కలు చాచినట్టయితే పక్షి నిడివి 11 అడుగుల దాకా ఉండవచ్చు. గాలి నిశ్చలంగా ఉన్నప్పుడు అవి ఎగరలేవు, వాలలేవు. హెూరు గాలి సహాయంతో అవి గాలిలోకి లేచి, గంటకు సుమారు 60 మైళ్ళ అద్భుత వేగంతో ఎగరగలవు. అల్బట్రాస్‌దీవి ప్రాంతంలో ఎప్పుడూ హెూరుగాలులు వీస్తూనే ఉంటాయి. చిత్రంలో ఉన్నది అల్బట్రాస్ మిధునం.



Photo by S. B. Takalkar



బహుమతి
పొందిన వ్యాఖ్య

గాడె క్రింది గడియారం

పంపినవారు :
పి. వెంకట్రావు

Photo by S. B. Takalkar



వివేకనగరం,
హైదరాబాదు-20

గాంధీతాత ప్రాణాధారం.

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జనవరి నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మార్చి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట :
హరియానా జానపదనృత్యం

మూడవ అట్ట :
బాంగ్రా నృత్యకారులు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


ఆహా!
ఎంత తీపి,
ఏం రుచి!
రంగుల రంగుల
క్యాడ్‌బరీస్
మిల్క్ చాక్‌లెట్
జెమ్స్
ఆడుదామా
పాడుదామా
హాయి హాయిగా,
తిందామా
Cadbury's
MILK CHOCOLATE
GEMS
క్యాడ్‌బరీస్
జెమ్స్
తీయ తీయగా!
రూ. 1
మాత్రమే

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైన మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, అలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26








మా అందరకూ
ఇష్టమయిన
పత్రిక



# చందమామ




## మీకూ అంతేగా!

చందమామ పురుషులు, స్త్రీలు, పిల్లలు అందరూ చదువుతారు. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, తెలుగు, కన్నడం, తమిళం, గుజరాతీ, మలయాళం, బెంగాలీ, ఒరియా—పది భాషలలో ఇది వెలువడుతున్నది. ఈ పిల్లల పత్రికలో అపరూపమయిన కథలుంటాయి. ప్రతి హృదయాన్నీ సంతోషపరుస్తాయి.

చందమామ పిల్లల మాసపత్రిక. ఇది చదివితే పిన్నల ఉత్సాహం పెద్దలకు కలుగుతుంది. పెద్దల విజ్ఞానం పిన్నలకు అబ్బుతుంది.



చందా వివరములకు: డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు - 26

